# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-4-1981 సంచిక 12



—• ఈ సంచికలో •—



1—5—81 సంచికలో 'కావ్యవిమర్శ, తెలుగు కవులు – ఏడుపువర్ణన, దాశరథి మానవతాపథం, పోతన భక్తి కవితావిర్భావం, భట్టికవి – మహిష శతము మొదలగునవి ఉంటాయి.

—• 1, 16 తేదీలలో ప్రచురింపబడును •—

చందా
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-4-1981 | సంచిక 12

## కుమారసంభవము - తపోవర్ణన, ఋతువర్ణనలు

- 'భారతీప్రియ' శ్రీ సి. నీలకంఠం గారు.

ఆంధ్ర సాహిత్యమున శివకవి యుగమున పుట్టి ప్రప్రథమాంధ్ర ప్రబంధము అనదగిన 'కుమారసంభవము' ను రచించిన మహాకవి నన్నెచోడుడు. ఇతడు పార్వతి తపోవర్ణన యందు షడృతువులను ప్రబంధోచితముగ వర్ణించెను. అయినను కథానుకూల్యము దెబ్బ తినకుండ పార్వతి తపోనిష్ఠాగరిష్ఠతను, తపోమాహాత్మ్యమును ధ్వనించునట్లు రచించెను.

పార్వతి కడలేని విరహవేదనపడలేక శివునిగూర్చి తప మొనరించుటకై నిశ్చయించి తల్లిదండ్రులకు నచ్చచెప్పి గౌరీనగము నందు పరమేశ్వరుని కోరి ఘోర తపము చేయుటకు పూనుకొనెను. యథావిధిగా స్నానము, అర్చన, హోమము మొదలైన నిత్యకర్మలు శాకాహార ఫలాహార. పత్రాహార. జలాహార మారుతాహార, నిరాహారాది మహాతపో వ్రతములను అవలంబించెను. ఏకపాదాంగుష్ఠ, ఊర్ధ్వబాహు, ఊర్ధ్వముఖ, అధోముఖ, పంచాగ్ని మధ్యాది అనేక - ఉగ్ర నిష్ఠలను అనుష్ఠించుచుండెను. ఇట్టి ఉగ్రతపము చేత ఆమె చిక్కి సగమై అర్ధనారిగా శివుని మేన కలియుటకై అట్లు చేయుచున్నదో యనునట్లుండెను.

ఇట్లుండగా వర్షఋతువు వచ్చెను. వర్షఋతు వర్ణనను ఈ క్రింది పద్యమున తిలకింపుడు.

'పరమస్నేహము హృత్సరోరుహమునం
బాత్రంబుగా నించి సు
స్థిరతం బుణ్య దశం దపోగ్ని మది ను
ద్దీపించి బ్రహ్మాండ క
ర్పర ఖండంబున మంత్ర కజ్జల మొగిన్
ఫాలాక్షుఁ గూర్పంప న
గ్గిరిరాజాత్మజ పట్టె నా నమరి నిం
గిన్ పర్వె నీలాభ్రముల్' (6-96)

అప్పటి నీల మేఘములు పార్వతి హృదయ పద్మమే పాత్రముగ పరమేశ్వరునిపై స్నేహమే తైలముగా, తపస్సే అగ్నిగా, బ్రహ్మాండమను పాత్రయందు ఫాలాక్షుని కొరకై మంత్ర-కాటుక పట్టినట్లుండెను.

ఆసమయమున పార్వతి జడలపై పడిన అవజల కణములు తపస్సునకు మెచ్చి దేవతలు ముత్యముల సేసలు (అక్షతలు) చల్లినట్లుండెను. నన్నెచోడుని ఈ ఋతువర్ణన పద్యము కాళిదాసుని శ్లోకమునకు అనువాదమై భాసించును. చూడుడు.

'అడరు నవాంబుధారలు జ
టాటవిలోఁ బడి విభ్రమించి వె
ల్వడి చను దెంచి రాలు గొని
పక్ష్మముల న్వెడ నిల్చి మోవిపైఁ
బడి కుచఘట్టనం జెదరి
పాటి రయంబున ముత్తరంగలన్
మడుగులు వారి నాభికెడ
మానక జొచ్చెను క్రమంబునన్. (6 110)

అప్పటి వర్షధారలు ఆమె జడలలో బడి చిట్లి, కను బొమ్మలపై బడి అట నుండి చింది పెదవులపై బడి, అచ్చటి నుండిచిమ్మి వక్షోజములపై, అక్కడి నుండి చెదరి వళులపై నుండి నాభిలోనికి ప్రవేశించినవి.

ఆ తరువాత శరత్కాలము వచ్చెను ఆ సమయమున వికసించిన పద్మములు, కలువలు అపుడే మేల్కాంచిన లక్ష్మీనారాయణులు కన్నులు విచ్చి చూచినట్లుండెను. శరత్కాల వర్ణన మంతయు లక్ష్మీనారాయణమయముగా కవి సుదీర్ఘముగ వర్ణించి పార్వతికి పరితాపము కలిగించెనని చమత్కరించెను. శరదృతు

వున లక్ష్మీనారాయణులు మేల్కొనుట ఇందులకు ఒక కారణము కాగా శివభక్తి తత్పరయైన పార్వతికి ప్రణయవిరహ ప్రేరకమగుట మరియొక్క కారణము కావచ్చును. శరచ్చంద్రుడు శ్వేత ద్వీపముగా, వెన్నెల పాలవెల్లి (సముద్రము) గా, చంద్రునిలోని మచ్చ కృష్ణుడు (విష్ణువుగా) గా రాత్రులు ప్రకాశించెను

శత్రునిపై దండెత్తు మని హిమవంతుడు పంపినట్లుగా మంచు అలము కొనె నని కవి హేమంతమును వర్ణించెను అపుడు పార్వతి కత్తుక బంటి నీటిలో తపస్సు చేయుచుండెను. అపుడామె ముఖము కొలను ఒక పద్మమును తనకు విత్తుగా దాచు కొన్నట్లు విప్పారి యుండెను. ఇట్లు మిగిలిన ఒక్క పద్మముపై అన్ని తుమ్మెదలు వ్రాలినట్లు ఆమె ముఖముపై జడలు పెనవేసుకొని యుండెను. ఇట్లుండగా వసంతము వచ్చెను. అపుడు రాగులకు (రాగము గలవారు) శలరసము ఎక్కువయ్యెను. వసంతవర్ణనము రెండుపద్యము లలో చేయబడినది వసంత విజృంభణము పార్వతిని చలింపఁజేయలేక పోయెను, అన్నట్లు ఆమెపై వసంతప్రభావము వర్ణింపబడలేదు ప్రతి ఋతు వర్ణనము మొదట స్థూలముగా వివరించి పిమ్మట సూక్ష్మముగా వర్ణించుట 'ఇతని పద్ధతి. అట్లే గ్రీష్మము వర్ణింపబడినది.

'తలచిన డెందము కందును
పలికిన నోరెల్ల పొక్కు బ్రభ చూచిన రె
ప్పలు కమరు నవగ పటుతర
విలయానల భాతి ఎండ వేసవి గాచెన్'

ఇందలి జాను తెనుగు, దేశికవిత మనోజ్ఞమైనవి అట్టి వేసవిలో పార్వతి పంచాగ్నిమధ్యమున తపస్సు చేయుచుండగా సంధ్యారుణ మేఘములలోని నెలవంక వలె నున్నదట ఆమెముఖ పద్మము ఎండకు వాడి పోయినను కన్నులు కలువలవలె వికసించి యున్నవట. గిరిజ తపశ్శక్తిని పగలు రేయి చేసెనో అన్నట్లున్నదని చోడుడు అత్యద్భుతముగా వర్ణించెను. ఇప్పటినుండి పార్వతి తపస్సు శక్తిమంతమై సర్వలోకములలో సర్వప్రాణికోటిలో సంచలనము కలిగించి సదాశివుని కైలాసము గూడ బొంగరము వలె తిరుగునట్లు చేసినది. ఈ వర్ణనము వస్తుకవితయు, దేశి కవితయు జోడించిన జాను తెలుగునకు తలమానికము వంటిది. ఈ విధముగా ఋతువర్ణనలలో వస్తు కవిత కూర్చుటయే కాక నన్నెచోడుడు పౌరాణిక సంప్రదాయములను రాజాస్థాన విశేషములను కూడ ఇందు పొందుపరచెను.

'జల వాసులైన వారిల
క్ష్ములు వర్ష నిశావసానమున మేల్కనిక
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పల రుచులు వెలసె శారద వేళన్'
(6-11-8)

ఇందు శరత్తునందు పద్మములు, కలువలు సమవికాసము పొందుట పౌరాణికముగా సమర్థింప బడినది

'ఆక్రొక్కారను రాజు ప్రోల నిజరా
వానంత గేయాభ్రసా
దైకాతోద్యముఁ గూర్చి మ్రోయు సురగో
పాంభోదరాగత్విషా
నీకోద్యద్ధరి దళ్మ కస్థల అస
న్నృత్యోర్వరరంగస్థలిన్
కేకీపాత్రము లాడె భావముగ ఉత్
క్షిప్రాగ్రపింఛంబులై' (6-103)

ఇందు రాజాస్థాన నర్తకీ మణుల నాట్యము ప్రతిఫలించినది

ఋతువర్ణనలలోనే కాక పార్వతి తపోనిర్ణయమును విని మేనకా హిమవంతులు బుజ్జగించిన విధము దేశీయమై మనోహరముగా నున్నది.

'చిరుత వడిరి నిన్ను వెరుఁగవు గాన నీ
యర్థి గారణముగ ననియె దబల
వాస వాదు లతని దాసులుగాఁ గాన
రేను మామ గాఁగ నేల కూడు.'
పూవో పూవో యని చే
రెవిన కందునని యోసరిల్లెడు నాపై
జీవంబు నిలుచునే నిను
బోవిడిచి మహోగ్ర దుర్గములఁ
బాల్పడఁగాన్.

పార్వతికి కానుపించిన నిషాదులు, పుళిందులు మున్నగు వారి వర్ణనము దేశి కవితలో సాగినది. పార్వతి తపోవేష వర్ణన యందు నన్నెచోడుడు కాళిదాసుని శ్లోకములను జాను తెనుగులో అనువదించెను

'పరులతో గూడ పిలిసిల్లు గిరిజ మొగము
జడలు తాల్చెఁ గడు బెడంగడలి పొల్చె
భృంగములు మూఁగి చెలువొందు
బిసరుహంబు
పాఁతు దాల్చియుఁ గర మొప్పు
భంగి వోలె.' (6-85)

ఈ విధముగా నన్నెచోడుడు శివకవియైనను శివకేశవ భేదము లేక సమన్వయ దృష్టితో సరసకథానుకూలమైన కవితా రీతులు ఋతువర్ణనలతో జోడించి పార్వతి తపస్సును వర్ణించెను పార్వతీ తపోవర్ణన యందు వస్తుకవితను దేశికవితను, జాను తెనుగు భాషలో జోడించి ఋతువర్ణలను సహజసుందరముగా సరస మధురముగా గావించెను.

— .. —

# చిత్రభారతమునాటి స్థితిగతులు

- కుమారి డి. అన్నపూర్ణ, ఎం. ఏ.

'Literature is intimately related to society Society influences literature in many ways and the connections of literature with society are integral and pervasive Literature is the finest expression of contemporary feelings· Those who understand literature can learn, from it the most about the thought of the period '[1]

వాఙ్మయమునకు సంఘమునకు గల సన్నిహిత సంబధమును వాఙ్మయముపైఁ గల సంఘ ప్రభావమును గూర్చి చెప్పిన డా. B మల్లిక్ గారి అభిప్రాయ మిది

మాథ్యూ ఆర్నాల్డుగారి దృష్టిలో సాహిత్యము జీవితమునకు భాష్యము వంటిది. వారి అభిప్రాయములను బట్టి సాహిత్యమునకు, సంఘమునకు అవినాభావ సంబంధము గలదని, కలిగి యుండడమే అవసరమని స్పష్టముగు చున్నది. విమర్శకు లీ విషయమును దృష్టియం దుంచుకొని కావ్య విమర్శను చేసిన అది రాణించును కాని నేటి వారిలో కొందరు ఈ పద్ధతి సమంజసము కా దని భావించువారు గలరు. అది పొరపాటు-ఏమన కవి సంఘజీవి. అతని కృత మైన కావ్యము నందు నాటి పరిస్థితి యాదృచ్ఛికముగా నైన పరే గోచరించక మానదు కవి యన్నవాడు తాను చూడని, వినని, అనుభవించని విషయములను అభినివేశముతో వర్ణింప జాలడు (కొన్ని తాను అనుభవించడు విని, చూచి వ్రాస్తాడు అలాగే మిగిలిన కూడ.) ఈ సందర్భము నందు పూజ్యులైన శ్రీ దివాకర్ల వేంకటావధాని గారి మాటలను ఎంతైనా స్మరించవలసి వుంది కవు లెంత ప్రతిభావంతులైనను సంఘమునం దంగము లైన వ్యక్తులే. వారు దానిని ఆశ్రయించియే తమకవితావ్యాపారము సాగింతురు అట్లు చేయనిచో వారి సృష్టి భాషాభివృద్ధి సాధనమైనను విశ్వ శ్రేయమునకు సహాయము కాజాలదు. [2]

దీనిని బట్టి చూడ కవికిని, సంఘమునకు అవినాభావ సంబంధ ముండి తీరవలె ననుట స్పష్టమైనది. కావున సాహిత్యమునకు సంఘమునకు బింబ ప్రతిబింబ భావ సంబంధము గల దనుట నిర్వివాదము. ప్రపంచములో నేజాతికి చెందిన సాహిత్యమునకైనను ఇది సమాజ లక్షణమై యొప్పారు చున్నది.

ప్రబంధ యుగము నాటి దయ్యు వెలుగులోనికి రాని కావ్యము చిత్రభారతము. ఇది చరిగొండ ధర్మనచే క్రీ శ 1504-1512 సం॥ములమధ్యప్రాంతంలో రచింపబడినది అతడు క్రీ శ. 1470-1530 ప్రాంతములకు చెందిన వాడు. చిత్రభారతము నందు నాటి మత రాజకీయ సాంఘిక పరిస్థితు లేవిధముగా చోటు చేసుకున్నవో సూక్ష్మముగా వివరించుట యీవ్యాసోద్దేశము

మతము - ధర్మన కాలము నాటికి వైష్ణవ మతము మిగుల ప్రచారము నందిన దని చిత్రభారతమును బట్టి చెప్పవచ్చును కవి తాను నారాయణ ధ్యానతత్పరు డని స్వయముగా చెప్పుకొనెను (పీఠిక 17) ఈ కావ్యము నందు పేర్కొనబడిన వారందరును వారి పాద భక్తులే ధర్మన అడుగడుగునా అతని వైష్ణవ భక్తి ప్రియత్వమును చూపించినాడని కావ్యపరన వేళ స్ఫురించక మానదు ఇందు చతుర్థనుడు ముల్లోకములను సందర్శించు ఘట్టము గలదు ఆసమయమున కవి తనివి తీర దేవతాస్తుతి చేసి, కొనియాడి, తరించినా డనియే చెప్పవలెను.

ఈతడు వైష్ణవ భక్తు డగుటచే తన కావ్యము నందు తత్సంబంధి యైన రచన గావించినాడు ఉదా -

"చెలఁగి" వారే ర్నకించి ద్వ్యతిరిక్త మస్తి,యటంచు బల్కు రాచిల్కగములు వరుసమై 'వాసుదేవ స్సర్వ మితి' యని సతతంబుఁ బలవించు శారికలను
'నచనచ నారాయణాత్పరం మంత్రమన్'
తెలివిని ప్రమోదము నిందిందిరములు
మోదముతో' 'నమో వేదాంత వేద్య'
యని రొతిఁగించు పికావళియును.

ఈ విధముగా రాచిల్కలు శారికలు, పికములు, ఇందిందిరములును విష్ణువు నే స్మరించుచు నుండెడి వని తెలియ జేసెను.

అరోజుల్లో సకల వేదశాస్త్రములు చదువ నప్పుడు కవుల్లు పోయిన యట్టి యెడలఁ దీర్చి చదివించునట్టి సద్విజకులంబువారు గలరని తెలియఁ జేసెను. వేద శాస్త్ర అధ్యయనము బాగుగా నిర్వహింప బడు చుండెడి దనుట వ్యక్తముగు చున్నది

రాజకీయపరిస్థితి - నాడు ప్రజలు-రాజు అన్యోన్యముగా నుండెడివా రని, రాజు తాను దర్శించిన విశేషములను మంత్రులు మొదలగు వారితో ఎంతో గారాబముగ చెప్పెడివా డని (5-42) రాజాస్థానమునకు గొప్ప వ్యక్తులు వచ్చినపుడు రాజు నిజ పరిజన సహితముగా ప్రత్యుత్థానము చేసి తన కిరీటము వారి పాదాగ్రంబులు మోవ సాష్టాంగదండ ప్రణామం బాచరించి, వారి పాదరేఖలు తన మందిరం బలంకరింప నడపించి సుఖాసీనులంగావించి ఆతిథ్యం బొనరించి కృతాంజలి ఘటించే వాడని (5.45), ఆ పిదప వారి నుండి రాజ్య పరిపాలనా పద్ధతులను వివ

ణముగా అడిగి తెలిసికొనెడివా డని (5-50), తెలియుచున్నది. ఇది రాజైనట్టి ప్రతివ్యక్తి యొక్క యొక కర్తవ్యము ఈ కర్తవ్యమును నాటి రాజులు సమర్థముగా నిర్వహించె వారని చిత్ర భారతమును బట్టి తెలియుచున్నది ఈ విధమైన చర్యల వలన రాజు ప్రజాను రంజకముగా పరిపాలన వడిపినట్లు విశదమగుచున్నది. ప్రజలు రాజు నెంతో ప్రేమించెడివారో నే విషయము వారు రాజు లేని రాజ్యమును పతిలేని స్త్రీతో పోల్చి దుఃఖచుటలో) (5.51 5.55 వెల్లడియగుచున్నది

ప్రజలు వారికేదైన గొప్పఆపద సంభవించి.పుడు వచ్చి రాజుతో మొర పెట్టుకొని తమను రక్షింపు మని వేడుకొనెట గలదు (5-78, రాజు ప్రజల బాధల్ని వెంటనే తీర్చి ఆదుకనే వా డనుట స్పష్టము. (5-81, 82)

నాటి రాజ్య వ్యవస్థలో చారులు ప్రముఖపాత్ర వహించెడివారు వారు రాజులకు దూరము కనిపించు కన్నుదోయి వంటి వా రని (2-39), వర్ణిచబడిరి రాజు ప్రజాభిప్రాయమును ఎట్టిది [illegible] ఈ చారుల మూలమున తెలిసికొని పరిపాలనను సక్రమముగా నిర్వర్తించెడివాడు (2-39 41)

ఎదుటివారి బలమును తెలిసికొని ఆపై యుద్ధమునకు వెళ్ళినచో రాజు జయమును పొందగలడనియు కొలది గాని మనుజులకు బోయినచో కీడు ఎదురవు నని రంభా-దేవేంద్రుల సంభాషణ సందర్భమున (2.95) తెలియజేసినాడు ధర్మన. తమకు సమస్య లెదురైనప్పుడు రాజులు గురువులతో సంప్రదించి వారి సలహాలను పాటించే వారట (2-54) రాజు రాజమార్గమున వెళలు పుడు ఆతని దర్శనాయత్తచిత్తలై పురస్త్రీలు పురుషులును ఉన్నత హర్మ్యముల నెక్కెడి వారట. (4 23)

నాటి ప్రభువులు యుద్ధమునందు ఆయుధములుగా శరకు, తోమర, గదా ప్రాస, కృపాణ, చాప, పట్టిస భిండివాల, శూలాదుల నుపయోగించెడివారు.

చెంచులువచ్చి వేటకు ఆహ్వానించగా రాజు వేటకివెళ్ళెడివాడు. చెంచులు రాజు వద్దకు వచ్చినపుడు కానుకలుగా కరికుంభజాత మౌక్తిక పరికరమును,సంకుమదము మృగ మదము, కప్పురసీరము మొదలగునవి తీసికొని వచ్చి ఇచ్చెడివారు వేట యనంతరము అట నిమ్మపంటి పులునును లవణాదుల గూర్చి అందరు కలసి భుజించెడి వారు. (3 156)

హైందవ పవిత్ర సంస్కృతికి ఆటపట్టులైన గోబ్రాహ్మణలపై నాటి ప్రభువులు, ప్రజలు అధిక భక్తి గౌరవములను కలిగి వర్తించెడివారు. బ్రాహ్మణులను వారు దేవతలుగా భావించి సేవించేవారు. రాజైన చిత్రాబుఖాను అను పదవత్సరము బ్రాహ్మణులకు గోసహస్రముల నిచ్చెడివాడట (పీఠిక, 13). కృతిపతి వంశములోని వారైన నారయ, మాదయ్యగారలు నిరువమస్కార భూసురపురస్కారములను అనుదిన వ్రతముగా నాచరించే వారట (పీ 35) మరియు సింగమంత్రి నారాయణుని మందిరము ఎల్ల భూసుర సుహృజ్జనసమూహములకు మనికి పట్టుగా నుండెడిదట. (పీ. 39)

రాజులు యుద్ధమునకు బయలుదేరుటకు పూర్వము బ్రాహ్మణుల ఆశీర్వాదమును తప్పనిసరిగ గ్రహించెడివారట (7 20) వీటినిబట్టి చూడ నాటిసంఘమునందు బ్రాహ్మణులకు చక్కటి స్థానముండెడి దనుటలో నాశ్చర్యము లేదు.

నాటి ప్రభువులు "శరణాగతరక్షణ' ధర్మమును చక్కగా నిర్వర్తించెడివారని ఈ 'చిత్రభారత గాథ' వ్యక్తపరచుచున్నది

సంఘ పరిస్థితులు - నాటి కుటుంబ జీవన విధానము సమిష్టి పద్ధతిలో కొనసాగెడి దని తెలియుచున్నది. మరియు అన్నదమ్ములైనవారు వారిలో వారు తగవు లాడుకొన్నను శత్రువు తమపైకి యుద్ధమునకు వచ్చుచుండిరని తెలిసినపుడు పరస్పర వైరమును విస్మరించి అన్యోన్యానురాగముతో కలిసిమెలసి శత్రువులను ఎదుర్కొనెడివారు.

ఆనాటి సాంఘిక వ్యవస్థ యందు మత్తుమందు, కనుకట్టు విద్య ప్రచారములో నుండెడివి. నాటి వేశ్యను గని విటులు ఆమెతోడి సురతకేళి పరమునైనట్టి సాయుజ్య పదముగా భావించెడి వారనియు ఆమె విలాసమును మదిలో తలచు కొనుట వలన జన్మ ఫలించినట్లుగ తలపోసెడివా రనియు (4. 88) చిత్రభారతమును బట్టి వ్యక్తమగుచున్నది. శృంగారమునకు లోటుండెడిది కాదన్న మాట.

మా త్రితయంబుల కమ్మలు ముంగరలును
జల్లి బోటులు బవిరెలుఁ జంద్రికలును
మొగపుఁ దీవెలుఁ గంకణంబులు సర బులును మొదలుగాఁగ సొమ్ములెల్లను ధరించి
3 42.

అనుటను బట్టి నాటి ఆభరణ విశేషములు తెలియుచున్నవి. ధర్మన వర్ణించిన ఆభరణములు, వజ్రాలు ముత్యాలు పగడాలు పచ్చలు మొదలగు వాని మూలమున నాటి ధన సమృద్ధిగా నుండెడి దని అభివ్యక్తమగుచున్నది

నాటి స్త్రీలు అలంకరణ విషయంలో నేటి వారికి తీసిపోనట్లుండే వారట చూడండి కురులను కొప్పుగా తీర్చిదిద్ది అందు పుష్పములను అమర్చేవారు, ఎదుటను సోగబొట్టు పెట్టుకొని ముత్యాల హారమును, వజ్రాలతో మణులతో పొదగబడిన బంగారు పట్టెడను, నవరత్నముల కూర్పుతోనున్న ఒడ్డాణమును, ముక్కుకి ముక్కెరలు ధరించేవారు చెవులకు ముత్యాల కమ్మలను కాళ్ళకు అంది

యలను, మట్టెలను ధరించేవారు. మేలిమి వస్త్రములను ధరించే వారట. నాటి స్త్రీలు ముత్యాలసెట్టుని మాచింగుగా వాడేవారని తెల్లమగుచున్నది నేటి స్త్రీలు మాంగరను ధరించుట, కాళికి అందియలను పెట్టుకొనుట అనునది (చదువుకున్న స్త్రీలు) క్రొత్త సీసాలోని పాత సారాయే అన్నమాట.

ఆనాడు స్త్రీలతో పాటుగా పురుషులను కొప్పు పెట్టుకొని పూలను ధరించేవారట. మరియు చెవులకిఆభరణములనుకూడ పెట్టుకొనెడివారట. నేటికని కొందరు పురుషులు (విద్యావంతులుగూడ పాత ఆచారమును విస్మరించకలేక చెవులకి ఆభరణములను, నుదుటను బొట్టును పెట్టుకొనే వారు గలరు.

నాటి సంఘములో వడ్డీ వ్యాపార విధానము (2-102 ; గలదనియు, కల మును బట్టి పనులు చేసెడి వారనియు, విజయమును సాధించిన కుమారునికి తల్లి కానుకల నిచ్చెడి దనియు, (8-4) మొ|| విషయములు చిత్ర భారతము నందు సందర్భానుసారముగా చేయబడిన వర్ణన లను బట్టి తెలియు చున్నవి మరియు స్త్రీలు అతల సుయ్యాలలుగాం జేసికొని ఉయ్యాల లూగెడి వారనియు, దృష్టి దోషము తగులకుండ దృష్టి తీయించే వారనియు, ఒట్టువేయు అలవాటు కలల ప్రశ్నల నరయుట, నాడును గల వనియు, వైద్యవిధాన ముండెడి దనియు అనేక విషయములు చిత్ర భారతమును బట్టి తెలిసి కొనవచ్చును

ఇందుడు తుల్యమాని తపమునకు విఘ్నము గావించుటకుగాను మన్మథ రంభలను పిలిపించి వారిని ఉచిత విధముగా సత్కరించి, బహుమతి విశేషముల నిచ్చి, వారి అంకచందములను, బలకరాక్రమములను ప్రస్తుతించెను. ఏదైన కష్టమైన పనిని చేయించుకొనుటకు పూర్వము వారిని పొగడినచో (కాకాపట్టినచో) నేటి పరిభాషలో) ఆకార్యము వెంటనే జరుగునాడి తలంపు ఆచారము నాటి నుండి నేటి వరకును కొన సాగుతూనే యున్నది

పూర్వజన్మ సుకృతము వలన చతుర్ముఖుడు మేనితోడనే మల్లోకములను దర్శించు భాగ్యము కల్గినది. కాపాలస్థలో నున్న రంభ అశ్వరూపమున నుండి ఆ రాజుకి మల్లోకము అందలి దేవతలను నేటి టూరిస్ట్ గైడ్ వలె చూపించినది

సంఘములోని ప్రతి విషయమును పరిశీలనాత్మకముగా చూచి సందర్భానుకూలముగా తన కావ్యమునం దవతరింపఁ జేసిన కవి వరేణ్యుడు, లోకజ్ఞతా నిపుణుడు చరిగొండ ధర్మన.

1 Principles and history of literary criticism· Dr B Malik P· 14

2. సాహిత్య సోపానములు. P 47·

— —

# కవిగా అప్పకవి ప్రతిభ

- శ్రీ కే. కిశోరుబాబు, ఎమ్. ఏ.
- శ్రీ కే. అశోకబాబు, బి ఎస్ సి. (అగ్రి)

నిన్నటివరకు తెలుగు పండితులందరు భగవంతునికి గూడా వెఱచెడువార కా రని, అంచుక యించుకైనను అతనిని చీరికి గొనెడు వారుకా రని, కాని లాక్షణికుడగు కాకునూరి అప్పకవి పేరుచెపితే మాత్రము అడుగులకు మడుగులొత్తుచు అతనియెడల నిరుపమానమైన భయభక్తులను ప్రదర్శించెడు వారని శ్రీ ఆరుద్ర గారు పేర్కొనినారు (సమగ్ర ఆంధ్ర సాహిత్యము 11 సంపుటము. పుట 219) దీనివలన తెనుగునాట లాక్షణికుడుగా అప్పకవి ఎటువంటి ప్రళయ ఝంఝా మారుతములకు గూడా చెక్కు చెదరనటువంటి తుత్తునియలుగానటువంటి స్థిరమైన, మూర్తిమంతమైన కీర్తిసౌధమును గట్టుకొనినాడో విశదమగుచున్నది. అతని 'ఆంధ్రశబ్ద చింతామణి' (అప్పకవీయము నకు కవి యుంచిన పేరు) 'సారపాదపమని' ప్రశస్తి గాంచినది దాని మహిమను గురించి అప్పకవే స్వయముగా

ఇది చదివిన పిమ్మట మతి
యెది యేనియు జదువుబుద్ధి
యేలావొడమున్
బదపడి గ్రంథము లన్నియు
వెదకివెదకి సార మెల్ల వివరింపంగన్
(అప్పకవీయము 1-7)

అని నుడివినాడు పైమాటలను వ్యాఖ్యానిస్తూ శ్రీ ఆరుద్రగారు ఇది అక్షరాలా నిజం అయికూర్చుంది' అప్పకవీయం చదివాక ఇంకేవీ చదవా లనిపించదు' అని పలికినారు (సమ ఆం. 11 పుట. 233) అది బద్ధుకాదు వాస్తవము!

అప్పకవి వైదికబ్రాహ్మణుడు భారద్వాజసగోత్రుడు కవిపండితుల వటుంబమున జన్మించినవాడు. వారి ప్రాపకమున పెంపొందినవాడు అతని తండ్రివంక వారు అందరూ వాణీముఖ కమలతాంబూలరసమును చుబ్బన చూఱగా జుర్రిన వారే! అతని తండ్రి వెంగనార్యుడు వేదములు వోసినగాదె, మాఱట బ్రహ్మయని వాసికెక్కినవాడు. గోణముకట్టుటాది అప్పకవి పెక్కు రుపాధ్యాయుల వద్దచేరి వివిధ శాస్త్రముల నభ్యసించి వాటిని ఊచముట్టుగా గ్రహించినాడు చదువులలోని మర్మముల నెల్ల అరచేతియుసిరికగా నొనరించుకొనినాడు సంస్కృత ప్రాకృతాంధ్రములందు తలబంటి పాండిత్యమును సంపాదించుకొనినాడు. అప్పకవీయమునందు అతడు పేర్కొనిన 43లక్షణ

గ్రంథములను, 73 తెలుగు కావ్యములను, 316 పద్యములలోని విలక్షణప్రయోగములను, 23 కవుల చాటు పద్యములలోని విశేషములను పరికించిన ఎల్లలే కనిపించని సాహిత్య సముద్రమునందు అతడొక గజయీతగాడై ఈత గొట్టినాడనిపించును.

అప్పకవి ప్రసిద్ధలాక్షణికుడే కాక చక్కని కవికూడ. అప్పకవీయ పీఠికా భాగమును పరిశీలించిన అతనియొక్క కవితావైభవము మిరుమిట్లు గొలిపి మరులు గొలుపుచుండును. మమ్మారె యనిపించుచుండును. పిసరంతయినను ఊనిక కనిపించని నేవళమైన కవిత్వమందు వరగలించుచుండును అతడు అప్పకవీయమేకాక అనంతవ్రతకథ (కావ్యము) శ్రీనగాధీశశతకము, సాధ్వీజనధర్మము (ద్విపద) అంబికావాదము (యక్షగానము) అను కృతులను రచించినట్లు తెలియుచున్నదిగాని, ప్రస్తుతమవి అలభ్యములు. ఒకవేళ అవి లభించియుండిన అప్పకవియొక్క కవిత్వము జైవాతృకుని వలె జృంభించుచు సాహిత్యప్రియులకు మరింత ముదము చేకూర్చుచుండెడిదేమో!

జల్లిపదములు నాలుగు సంతరించి
గురువులిడుచోట లఘువులు గొన్ని గూర్చి
విరతిగూడక మీదులు వెదకికొనుచు
నచ్చు పొల్లులపై నుంచు నతడు కవియె?
(పీఠికాభాగము 1-48)

అని అప్పకవి కుకవి నిరసనము గావించినాడు చిలుకపలుకులో చిలుకపలుకులో కొన్ని నేర్చి వాటిని యతిప్రాసలందున గూర్చి పద్యములు రచించిన రచింపవచ్చునుగాని వాటిని విజ్ఞులు విని మెచ్చి పొగడికోలు లందించునంత రసవంతముగా రచించుట సుకరముగాదు. భూతలమున చెలమలు ద్రవ్వినంత సులభముగా చెఱువులను ద్రవ్వుట కాదుగదా! అప్పకవి ఈవిషయమును చక్కగా అవగాహన మొనరించుకొనినట్లు లున్నాడు. అందువలననే

ఛందోలంకారాదుల
యందలి పొల్లెల్ల దుదిని వ్యర్థము గావే
సుందరమగు వాక్యంబుల
పొందెరిగి రచించు బుద్ధిపుట్టకయున్నన్.
(అప్పకవీయము 1-57)

అని పేర్కొనినాడు.

చెప్పదగు కవిత రసము
ల్చిప్పిల, నప్పప్ప బళిబళియన లేదా
యెప్పుడు చేయక యుండుట
యొప్పు సుమీ!

అను మాదయగారి మల్లన అభిప్రాయమునే అతడనుసరించినట్లు లున్నాడు కవియను శబ్దము నీటికాకకిలేదా? కవిగా ఒక ఉన్నతమైన స్థానమును గడించుకొనవలె ననుకొనినాడు అతని అప్పకవీయపు మున్నుడి యందలి కవిత దీనినే ఋజువుపరుచుచుండును. అది పిచ్చుకకుంటువలెగాక సామజవరగమనమువలె సాగుచు మనోల్లాసకరముగా నుండును. ప్రస్తుతము దానిని పరిశీలింతము

అతడు దేవతాస్తుతిపిదప మొట్టమొదట బ్రహ్మను స్తుతించినాడు.

'సవితా బోధయతి పంకజాన్యేవ' సూర్యుడు తామరలకు చెలికాడు చంద్రుడేమో పగవాడు. చంద్రుని కళలు పదహారు అవి తిథుల ననుసరించి శుక్లపక్షమున ఒకటొకటి పెరుగుచుండును కృష్ణపక్షమున ఒకడొకటి తరుగుచుండును. ఒకకళమాత్రము పరమశివుని శిరసునందు వెలుగొందుచుండును చంద్రుడు సకల దైవత బుభుక్షాపూర్తికి పుట్టుకామనిలేని మెట్టపంటగూడా! ఈ విషయములను స్ఫురింపజేస్తూ అప్పకవి బ్రహ్మను స్తవమొనరించినాడు.

తన జనికారణంబయిన
తామరకున్ హితుడౌటచే వికర్తనునకు వేయిఘృష్టు లిడి
దానికి శత్రుడు గాన నేణచిహ్నునకు బదేను జేసి యవి
యున్ శిఖిభాను ముఖామరాళిచే
దినమొకటప్పు గైకొనను
దిద్దను జేయు విధాత గొల్చెదన్
(పీఠికాభాగము 1-18)

తన పుట్టుకకు మూలకారణమైనటువంటి తామరకు మిత్రుడగుటవలన మార్తాండునకు వేయికిరణముల నిడి వానికి విరోధి యగుటవలన శశాంకునకు పదిహేను కళల నిడి అవి గినమొకటిగా అగ్ని, సూర్య, దేవతలచేత పానముగావింపజేస్తూ మరల నొసగుతూ యున్నటువంటి కుశలుడగు పితామహుని గొలిచినాడు. 'భక్ష్యార్థం సర్వదేవానాం సోమః సృష్టః స్వయంభువా' అను దేవీపురాణ శ్లోకపాదమును విస్తరించి దానికి ఈ తీరున సుందర సురభిళ కవితా రూపమొసగినాడు అమృత, మానద, పూష, తుష్టి, సృష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత అనునవి చంద్రుని యొక్క పదహారు కళలు వాటియందు మొదటిదగు అమృతను వీతిహోత్రుడు రెండవదగు 'మానదను' భాస్కరుడు మిగిలిన వాటిని బృందారకులు భుజించుచుందురు ఈ సంప్రదాయమును అప్పకవి ఈ పద్యమున చక్కగా ఎరుకపరచినాడు.

ఈ పద్యమునందు నెత్తమ్మినెయ్యపుపట్టియగు బ్రహ్మయొక్క పక్షపాతగుణమును తెలియజేసినాడు నిశితముగా పరిశీలించిన అప్పకవియందుగూడా ఈ స్వభా

వము గోచరించుచుండును. బ్రహ్మవలెనే తనకు వచ్చిన వారిని (తన రచన యగు అప్పకవీయమునందు) అందల మెక్కించినాడు. నచ్చనివారిని అధఃపాతాళమునకు ద్రొక్కినాడు. అతనికి శూద్రకవులతనిన ద్వేషము

ఊపము గలిగి శయ్యలనొప్పియున్న సంక్రి
భవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు పాయ
సంబయైనను సంస్కారపక్వమైనఁ
గాక జుష్టంబు హవ్యంబు గాని యట్లు.
(1 26)

అని శూద్రకవుల రచనలను నిరసించి చికొట్టి నాడు. కృష్ణదేవరాయలు శూద్రస్త్రీయందు జన్మించినవా డనిలోక ప్రవాదముండుట చేత కాబోలు అతనియొక్క ఆముక్తమాల్యదా కర్తృత్వమును అల్లసాని పెద్దనామాత్యున కంటగట్టినాడు భట్టు వలస్థు డని కాబోలు రామరాజభూషణుని యందు 'రామరాజ విభూషణరత్న ఖచిత చారుమస్తకలాపాది హారివాక్య గౌరవము శ్లేషభంగుల గణనజేసి (1-27) అని తీవ్రమైన ఘృణను ప్రకటించినాడు. రల యతిమైత్రికి లక్షణవిలాసకర్త లక్ష్యముగా జూపిన 'ఓలంబాలక' యను వసుచరిత్ర పద్యమునందు రలయతిమైత్రిలేదని పాఠాంతరము జెప్పి ఆపద్యము నెత్తివ్రాసినాడు. తన కయిష్టమైన అఖండ యతి ప్రయోగములు పూర్వకవులు ప్రయోగించినను అవి శుద్ధ తప్పు లని సరిదిద్దివాడు ధ్రువము అనుమాటలో (కారకొమ్ము గల దని అది వట్రుసుడితో ప్రయోగించుట నిషేధ మని తెలుపుతూ తానే ధ్రువ సన్నుతా అని (4-326) యతిస్థానమున ప్రయోగించినాడు. రేఫమ్ములు జాలను గలిసి ప్రాసములైన కతంబున గదా యిమ్ముల నాదిలాక్షణికు లెల్లను భాగవత ప్రయోగము లుదహరించమానినా రని బమ్మెరపోతరాజునుదుట ఓ మాయని మసి బొట్టు పెట్టినాడు. ఏణచిహ్నుని పదిహేనుకళలను శిఖిభాను ముఖామరాళిచే దిన మొకటప్పు గైకొనను దిద్దను జేయు విధాతవలెనే అప్పకవి గూడా కొందరి కవులకళలను మ్రింగి మరికొందరివి దిద్ది అప్పకవీయమును రచించినా డన వచ్చు అప్పు గైకొనను దిద్దను జేయు విధాత యనుటలో, లాక్షణికుడు గూడా లోకమునందు గల కవుల ప్రయోగముల నప్పుగా గొని వాటి దోషాదోషములను జీర్ణించుకొని వాటిని సరిదిద్దుచు విధాత వలెనే దీప్తించుచుండు నని తను ప్రారంభించిన లక్షణగ్రంథముద్వారా చేయబోవు కృషి యదియే యని కూడా సూచించి నాడేమో!

పోతన గారి ఒరవడిలోనే అప్పకవి గిరాందేవిని ప్రార్థించినాడు శారదనీరదేందు ఘనసారపటీర అని ఉత్పలమున పోతనామాత్యుడు పూజించగా

శారద విద్యా జాలవి
శారద ననుబ్రోచుకొరకు సారెభజింతున్
శారద నీరద నారద
పారద హారదరహీర పాండు శరీరన్
(పీఠికలో 1-19)

అని అతను కందమున కరములు మోడ్చినాడు కంద శబ్దమునకు హారతికర్పూర మని గూడా అర్థము. పదునాలుగు విద్యల పట్టుగొమ్మ ప్రణవపీఠికనుండు పద్మగంధి వాగ్దేవిని కందమున (హారతికర్పూరమున) అర్చించుచు అభినుతించుటలో అప్పకవి లాక్షణికత్వము బయల్పడుచున్నది.

కుమారసంభవ కృతిపతియగు మల్లికార్జున ముని కీర్తిని వర్ణిస్తూ నన్నెచోడుడు అది పరమ శివుని మందస్మితమువలెను, ఆకాశగంగా జలమువలెను, రాయంచ వలెను పద్మమువలెను, హిమాలయము వలెను కప్పురము వలెను, కళానిధవలెను, ఆదిశేషుని వలెను, సురగజమువలెను, కలశపాథోరాశివలెను, ముత్తియముల దండవలెను, మల్లియలవలెను, కలధౌతము వలెను, శరత్కాదంబిని వలెను ద్యోతమానమై యొప్పుచున్న దని మహాస్రగ్ధరలో వర్ణించినాడు.

హరసాకాశ గంగా
త్యమలజల మరాళాబ్జ నీహారధాత్రీ
ధర, కర్పూరేందు, కాకో
దర వరపతి, దిగ్దంతిప క్షీర నీరా
కర, ముక్తాహార కుందో
త్కర రజతశరత్కౌముదీ ద్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీ
వరు వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్.
(కుమార 4-119)

స్రక్ అనగా పూలమాల. గురువుగారి యొక్క యశమును పూలమాలికగా గట్టి వర్ణించుటలో నన్నెచోడుని యొక్క గురుభక్తి కన్పించుచున్నది వీటినే బమ్మెరపోతనగారు శర్వశుక్ల యగు సరస్వతీదేవి మూర్తిని వర్ణించుటకు గ్రహించి ఆ యమను ఉత్పలమున సేవించినాడు పోతనగారి పద్యమున భక్తిభావము పొంగిపొరలి కనిపించుచుండును.

తరువాతి కవులందరు సరస్వతి రూపమును వర్ణించుటలో చాలవరకు పోతనగారి భావములనే పోబడిగా అనుసరించినారు. అందులో అప్పకవి కూడ ఒకడు అతడు కడవలో కడలిని బిగించినటుల చిన్న కందమున సరస్వతి రూపమును కరువు గట్టి చూపించినాడు.

పర్వతములు కఠినమైనవి యగుటవలన వాటిరాజు పుత్రికయగు నీవుకూడా కఠినమైన చిత్తము గలదానవే అందువలన నిన్ను వలపించ నావశమా యని ఎగతాళి సలుపుచుందువుగదా బంగరు కొండనే సింగిణిగ వంచిన వడి కాడవగు నీకు ప్రాలేయాచలతనయ నగు నన్ను పరవశింపజేసి కరగించుట చిట్టమిడుచునంత సులభము కాదా యని పార్వతి మెచ్చుకొనుచుండు శివుని ప్రార్థించెద నని శివస్తుతి గావించినాడు.

కడుకఠినంబు లద్రులు జ
  గంబుల నందున సంభవించి పెం
పడరు నినుం గరంచ వశ
  మాయని నన్నిపు డంటివే కదా
వడిగనకాద్రి చాపముగ
  వంచిన నీకు హిమాద్రి జాత యా
పడతిగరంచు టెంత యను
  పార్వతి మెచ్చు శివుం దలంచెదన్.

(పీఠికాభాగము 20 వ పద్యము)

పార్వతి తనతండ్రి గట్టుల ఱేడైనను కర్కశుడు కాడని మంచుకొండ యని అందువలన అటువంటి వాని కూతురగు తాను కూడా మెతక యని నయగారి యని తెలుపుటను హిమాద్రి జాతయా పడతి గరంచు టెంత అనుటద్వారా అప్పకవి సరసముగా సూచించినాడు. వాగర్థములవలె సంపృక్తులైన పార్వతీ పరమేశ్వరుల చిట్టకములను పరియాచకములను వర్ణిస్తూ కవులు రసావళ్ళ వంటి కమ్మటి కల్పనలను సిద్ధపఱచినారు. ఉల్లమునందు నక్కటిక మూనుట మీకులమందు గంటిమం చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు శాంబరీభిల్లుడు లేతనవ్వునవ్వుచు కిరీటిని పాశుపతదివ్యశరాఢ్యుని జేయుచున్నాడట! పెద్దనామాత్యుడు (మను చరిత్ర 1-2) వర్ణించినాడు పెద్దన పేర్కొనిన అచలాత్మజ మేలమాడుటనే తరువాత వెలసిన కవులు తమ తమ ఊహాబలముచేత వివిధములుగ విస్తరించి ప్రత్యూషపవనాంకురముల వలె గిలిగింతలు పెట్టు రసవంతములైన వర్ణనలను సృష్టించినారు. అప్పకవి పద్యములోని 'హిమాద్రి జాతయాపడతి గరంచు టెంత యను పార్వతి మెచ్చు' చరణము పెద్దన పద్యములోని అల్లన మేలమాడు నచలాత్మజమాటకు అనుచరణమునకు కొద్దిగా నీడవలె జవ్వాడుచు కన్పించు చున్నది. ఊరక చుట్టుకున్న గమలోత్పల పంక్తులు వాడు నని యేఱునుగూర్చి చుట్టినావా! యెంతటి జాణవు మేలు మేలు నీనేర్పు మెచ్చవచ్చు నని నీహారగిరీంద్ర కన్యక నిచ్చలు మచ్చికను శంభుని కోఁడడ మాడుచున్నదట! కంకంటి పాపరాజు ముద్రాలంకారమున (ఉత్తరరామాయణము 1-4) ముచ్చటగా వర్ణించినాడు. సానువయము, శీతగుణము చారుపాదరేఖ కఠిన వక్షోజ ద్వయము, నితంబశోభ గలిగిన పార్వతి అచ్చముగా తండ్రిపోలికనున్న దని పరమేశ్వరుడు చిరుత నగవులు చిందించుచున్నాడట. అప్పకవికంటె పూర్వుడగు పెదపాటి ఎఱ్ఱన (మల్హణచరిత్ర 1-1) శ్లేషాలంకారముల లలితముగా వర్ణించినాడు. అప్పకవి పార్వతి నేను నగజాతనైనను కఠోరస్వభావురాలను గాను నీహారక్షమాభృత్ కుమారికను, సుకుమారిని అని పలుకగా పెదపాటి ఎఱ్ఱన శివుడు నీవు నిజముగా అద్రిరాజతనయవే అని పలికినాడు. ఎఱ్ఱన పద్యము రసదాళికవలె నున్నది.

శ్రీలలితంబు సానునయ
  శీతగుణంబును జారుపాదరే
ఖాలసనంబు జన్నుగవ
  గట్టితనంబు నితంబశోభయున్
బోలును గౌరి తండ్రి బడి
  బుట్టిన దంచుహసించు శంభుడే
వేళను జూండి కాళునకు
  వేడుక నీవుత గామితార్థముల్

(మల్హణచరిత్ర 1-1)

(సశేషము)

# శివశంకర శాస్త్రి కవితా వ్యక్తిత్వం

- శ్రీ గుడి నారాయణబాబు, ఎం. ఏ

మారుతూండడం సమాజం నైజం. ప్రపంచ సాహిత్యంలోను, మానవ జీవిత దృక్పథంలోను, చిత్తవృత్తులలోను ఈవిధంగా అన్నింటిలోను ఎప్పటి కప్పుడు పరిణామం కలుగుతుంటుంది. రెండవ ప్రపంచ యుద్ధం మొత్తం ప్రపంచ సాహిత్యంలోనే పరిణామాన్ని సృష్టిస్తే జాతీయోద్యమ ప్రభావం తెలుగు సాహిత్యంలో మార్పుకు కారణమైంది రచయితలందే సత్యాన్వేషణ దృక్పథం ఆకవి కృతుల్లో ప్రతిబింబిస్తుంది. అయితే సాహిత్యంలో కలిగే పరిణామం మానసిక సంబంధి కాలానుగుణంగా మారుతుండే భావపరిణామం కవిత్వంలో చోటు చేసుకొంటుంది

ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో భావకవిత్వమునేది పై విధంగా కలిగిన భావపరిణామం అనవచ్చు భారతీయ కవీంద్రుల్లో రవీంద్రుని గీతాంజలితో భారతీయ సాహిత్యం భావ కవితా పథంలో తొలి అడుగు పెట్టింది. ఆ తర్వాత అనేకులు ఈ ఉద్యమానికి పట్టుగొమ్మలుగా నిలిచారు. ముఖ్యంగా తెలుగు కవుల్లో రాయప్రోలు, గురజాడ, దేవులపల్లి, విశ్వనాథ తల్లావజ్ఝల మొదలగు వారెందరో।

అయితే వీరందరిలో సమకాలికుల్ని ప్రోత్సహించి వారిచేత అనేక భావ కవితల్ని సృష్టింప జేసిన ప్రయత్నం శివశంకర శాస్త్రి గారిదే. శాస్త్రిగారి కవిత్వ వ్యక్తిత్వ సమాలోచనమే ఈ వ్యాస రచనోద్దేశం.

శివశంకర శాస్త్రి పండిత వంశంలో జన్మించి శాస్త్రవిద్యల్ని బాల్యం నుండి అభ్యసించినందువల్ల వారికి సంప్రదాయ జ్ఞానం కలిగింది. వీరేశలింగం నుండి పర్యవసించిన సంఘసంస్కరణాభిలాష వీరి వ్యక్తిత్వంలో ఒక భాగం.

1919లో 'సాహితీ సమితి'ని స్థాపించి దానికి సభాపతిత్వాన్ని స్వీకరించారు. ఆయన అద్భుత వ్యక్తి. వ్యక్తే కాదు. మహా సంస్థ. ఖగోళానికి సూర్యుడెట్టివాడో 'సాహితీ సమితి' కి శివశంకర శాస్త్రిగా రట్టివారు. ఆయన సన్నగా ఉండి మధ్య పాపిట తోను, వల్లెవాటు తోను కనిపిస్తూ నేపథ్యరచనలో స్త్రీల వలె చాల జాగ్రత్తగా ఉండేవారు. ఆయన మూర్తి విలక్షణమైంది. సాహితీ ప్రపంచంలో క్రొత్త రీతులకు ద్రోవ చూపించింది, క్రొత్తరూపులు ఎరిగించింది, కవితా కన్యను మనోహరంగా చూడ ముచ్చటగా అలంకరించింది, ఆమెకు క్రొత్త సొడకలు నేర్పింది నవ కవు లందరిలోకీ తొలుదొల్త శివశంకర శాస్త్రిగారే. ఆయన చూపని సులభోపాయమూ లేదు. సమకాలికులయిన వేటూరి దేవులపల్లి, విశ్వనాథ మొదలగు వారిచే నవ్య కవితల్ని సృష్టింపజేశారు

శివశంకరులు గుంటూరు జిల్లా మంగళగిరి క్షేత్రసమీపంలోని కాజగ్రామంలో 12-9-1892 న జన్మించారు తల్లి లక్ష్మీదేవమ్మ, తండ్రి కృష్ణశాస్త్రి, 'శ్రీ కృష్ణలీలా తరంగిణి' రచించిన శివనారాయణ తీర్థులు పూర్వాశ్రమములో తల్లావజ్ఝల వంశీయులు అని ప్రసిద్ధి. శివశంకరులు మిక్కిలి సహృదయులు. అన్నింటికీ సానుభూతే గాని ఖండన లేదు. ఎప్పుడూ సమాధాన పద్ధతి ఆయనతో మాట్లాడి అందరూ తృప్తిపడి వెళ్ళేవాళ్ళు. ఎటువంటి వాడి కెట్లా సమాధాన మియ్యాలో అట్లా ఇచ్చేవాడు. సంస్కృతంలో ఉన్న సాహిత్య సిద్ధాంతాలకు సంబంధించిన లక్షణగ్రంథాలూ, ఇంకా ఆంగ్లంలో ఉన్న పొయిటిక్స్ మీద ఉన్న పుస్తకాలే కాకుండా ఫ్రెంచి, జర్మను, భాషలు చదువుకొని వాటిలో వ్రాసిన లలితకళా విజ్ఞానము చదివి హృదయాన్ని ప్రపంచమంత విశాలం చేసుకొన్న మనీషి.

నోరివా రన్నట్లు - 'He is a great linguist He has a perfect knowledge of Sanskrit, Telugu, and English. He is well versed in the Bengali and Hindi languages and has translated famous books from them in to Telugu He knows in various degrees Pali, Prakrit, Marathi, Persian, Urdu, German and may be other languages.'

శాస్త్రిగారు కవిత్వంలో నవ్యతను ప్రవేశపెట్టారు తెలుగు సాహిత్యంలో పద్యగేయ కావ్యాలకు పద్యగేయనాటికలకు నాంది పలికారు. తెలుగులో మొదటి గేయరూపకకర్త. భాషలో నవ్యతను ప్రవేశపెట్టినా, భావంలో ప్రాచీనతను విడువలేదు. ప్రాచీన భారతీయ ధర్మాల్ని నియమాల్ని, మతాల్లోని విశ్వాసాల్ని కాదనే సాహసానికి ఒడిగట్టిన వారు కారు, పైపెచ్చు వారు ఆధునిక సామాజిక సమస్యల్ని గ్రహించి ప్రాచీన హైందవ సిద్ధాంతాన్ని నిలిపిన రచనలు చేశారు. కవి సమకాలీన సమస్యల్ని తన రచనల్లో ప్రతిబింబింపజేసి ప్రజలకు తాను మార్గదర్శి కావడం అనే లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని వీరి రచనలు సాగాయి. ఒకవైపు రచనా వ్యాసంగం

మరోవైపు యువకవులచే కవితా సాధన చేయించే వ్యాపకం. ఈయన ప్రభావం లేని నవ్యకవి లేడంటే అత్యుక్తి కాదు. అంతేకాదు నవ్యసాహిత్య పరిషత్తు ఆవిర్భావానికి మూల కారకుడు సైతం శివశంకరులే.

1938 మార్చి నెల త్రివేణిలో వ్రాయబడినట్లు - 'It can be said without fear of exaggeration that there is no modern writer in the Telugu land who has not influenced by Sastry to some extent It was he that was mainly responsible for the establishment of the 'Navya Sahitya Parishat'

మిగిలిన రచనల నటుంచి 1952 లో షష్టి పూర్తి సందర్భంగా 'శివశంకర శాస్త్రి కృతులు' రెండు సంపుటాలుగ వెలువడ్డాయి. ప్రథమ సంపుటి పద్య గేయ కావ్యాలు. ద్వితీయ సంపుటి పద్య గేయ నాటికలు. పద్య గేయ కావ్యాల్లో హృదయేశ్వరి, వకుళమాలిక, సాధకుడు, వ్రతభంగము, రత్నాకరము ఆవేదన. కావ్యావళి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ కదంబములు కలవు. ఇక పద్య గేయ నాటికలలో పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, వరపరీక్ష, యక్షరాత్రి, సహజయానపంథ్, దీక్షితదుహిత, కవిప్రియ, పదాంకము, సద్వాక్యము అనేవి ఉన్నవి ఇవన్నీ ఆప్తులకు, సమకాలికులగు సాహితీ మిత్రులకు, అంకిత మివ్వబడ్డవే.

పద్య గేయ కావ్యాలలో 'హృదయేశ్వరి'కి లభించిన ప్రశస్తి ఇంతా అంతా కాదు, 'శాస్త్రిగారి అంతస్సు హృదయాగ్నిలో వెన్నవలె కరగి భావములను పాదరసము వలె ఎగబ్రాకిస్తుంది. ఈ కావ్యం అఖండమైన వేదన నుండి ప్రాదుర్భవించింది. ప్రణయ కవితకు ఈ కృతి ఆకరం

'మన్మనమ్మున లీనమై మాటు వడిన
విమల కవితా ప్రవాహము వెగ్గలించు
నిన్ను వర్ణింప నెంచిన నిమిష మందు
నీవు సాక్షి సరస్వతీ దేవివమ్మ!'

ఇది వారి విశ్వాసం. ప్రేయసి ఈయన దృష్టిలో మహాదేవి ఒక పవిత్ర దృష్టితో ఆమెను సంభావించాలని ఆయన తలపు. రాధాకృష్ణుల ప్రేమ సౌభాగ్యం, శివశంకరశాస్త్రి గారికి మేలుబంతి

'నిన్ను ధ్యానించు కొలది నిర్ణిద్రమగుచు
క్రమమమున జేరు మానస బంధురంబు
రాధికా నాథుపాద నీరజ యుగమ్ము
వింత గొల్పెడి నా ముక్తి కాంత వమ్మ'

శాస్త్రి గారికి 'హృదయేశ్వరి' ముక్తి కాంత. ఈవృక్వథం తన ఆత్మగతమైంది ఇక్కడ తన ఆత్మీయత కనిపిస్తుంది వీరి హృదయేశ్వరి లోపల నవ్యత, వెలుపల ప్రాచీనత, గల చక్కని కావ్యం స్త్రీ, సంసార తరుణోపాయమనీ, సర్వం అంబా స్వరూప మనీ వీరి భావం 'ఆవేదన' తర్వాత వచ్చింది. వేదుల సత్యనారాయణ శాస్త్రి గారికి అంకితం. ఇది, కవి తన 32వ సంవత్సరమున రచించిన పద్య ఖండికల సంపుటి. ఇందులో కవి తన స్నేహితుల విషయాలు తన అభ్యాసాలు ప్రతిఫలింపజేశారు.

పద్య గేయ నాటికలలో 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' మొదటి నాటిక భార్యా స్మృతికి అంకితమీయ బడింది. మూడు రంగముల నాటిక. పద్మావతి జయదేవుడనే సంస్కృతకవి భార్య. ఈ జయదేవుడు గీతగోవిందకర్త, లక్ష్మణసేనుడు గౌడ నగర పాలకుడు. అతడు తన సభలో గీతగోవింద కావ్యాన్ని విని అతనికి గజారోహణోత్సవం జరిపించి సన్మానించడం ఇందులోని ఇతివృత్తం. ఉత్తమ కావ్య నిర్మాణానికి భార్యాభర్తల ఆదర్శవంతమైన దాంపత్యం ప్రోత్సాహకం అవుతుందనే విషయం ఇందులో ప్రతిపాదింపబడింది శృంగార రసాధిదేవతయైన శ్రీకృష్ణుని యందలి భక్తికి, భర్తయగు జయదేవుని గీతారచనకు భార్య పద్మావతి నాట్యం ప్రోత్సాహకమేకాక, సౌందర్యాన్ని కూడా సంతరించింది. సరసులగు రాజు-రాణి రాజదుహిత తమ చిత్తవృత్తి ననుసరించి జయదేవుని సన్మానించారు పండితులు పలువిధాలుగ ప్రశంసించారు.

ఈ నాటికా రచనకు ప్రధాన కారణం ఆనాటి పండితుల్లో వున్న ఛాందసాన్ని ప్రతిఘటించడం కావ్యం కేవలం లక్షణ బద్ధమైనంత మాత్రాన కావ్యత్వం సిద్ధింపదనీ, భావప్రాధాన్యం, రమణీయార్థ ప్రతిపాదక శబ్దం మాత్రమే కావ్యత్వాన్ని ఇవ్వగలదనీ తెల్పి, నాటి భావకవులకు చేయూత నిచ్చి, నవ్యకవితకు ప్రాధాన్యాన్ని కల్గించారు

అలాంటి ప్రాధాన్యం కలిగిన వాటిల్లో 'దీక్షితదుహిత' ఒకటి. ఇది విశ్వనాథ సత్యనారాయణకు అంకితం. పదహారవ శతాబ్దం నాటి ఇతివృత్తం వితంతు వివాహ ప్రయత్నమే ఈ నాటికలోని ప్రధాన సాంఘిక సమస్య. సనాతన ధార్మిక విశ్వాసాన్ని అనుసరించే శివశంకరులు తమ దృఢ నిర్ణయాన్ని ఇందులోని అప్పయ్య దీక్షితుల ద్వారా వ్యక్తపరిచారు. సమాజంలోని వైదిక పండితుల మానవత్వపు విలువల్ని వ్యక్తపరుస్తూనే, సాంఘిక నీతి ప్రకటనతో లొంగిపోయిన నిస్సహాయ స్థితి ప్రకటింపబడింది.

అడయప్ప గ్రామంలోని అప్పయ్య దీక్షితులు గొప్పపండితులు. అద్వైతవైది

కలు, శిష్యప్రవచనాలతో కాలం వెళ్ళ బుచ్చుతున్న కర్మఠులు. ఆయన కూతురు మంగళాంబ బాల వితంతువు. ఆమె మాంగల్యం పేరులోనే మిగిలి పోయి నందుకు కగిలిన హృదయాలతో ఆకుటుంబ సభ్యులందరు కాలక్షేపం చేస్తుంటారు. చంద్రమౌళి అప్పయ్య దీక్షితుల శిష్యుడు మానవత్వంతో మంగళాంబను గూర్చి బాధపడుతున్న వాడు. వివాహమాడే సాహసాన్ని చూపడానికి సిద్ధపడ్డ వాడు 'మరకతవల్లి' మంగళాంబకు చెల్లెలు.సరస వాణి తన తల్లికి తోబుట్టువు ఈమె చంద్రమౌళి సంసిద్ధతను దీక్షితులు గారికి చెబుతుంది. విని, సంతోషించాడు.శిష్యుని యోగ్యతను మనస్సులోనే అభినందించాడు. కాని వృద్ధ బ్రాహ్మణుల వాదనకు వెనుకాడే వాడు యువ బ్రాహ్మణ సర్వమేశకు-సాహసము నేయు ఉరకలు వేసినాడు. అయినా శాస్త్రానికీ, సదాచారానికీ జంకి ద్వైధీ భావంతో మగ్గి, తుదకు ప్రాచీనాచారానికీ సంప్రదాయనికీ లొంగిపోయాడు. మంగళాంబ పేరుకి మంగళాంబ.

కూతుళ్ళ మాంగళ్యానికి ఉవ్విళ్ళూరే తల్లి దండుల మనఃప్రవృత్తికి ఈనాటిక అద్దం పట్టింది. పునర్వివాహానికి యువకుల సన్నద్ధత చూపబడింది మానవతా దృష్టితో ప్రతి హృదయం స్పందించింది. అయినా పండితుల హృదయాలు ప్రతి ఘటనకు సిద్ధపడలేక పోయాయి. వారి స్థితి ముందునుయ్యి వెనుక గొయ్యిగా వుంది. ఈ పరిస్థితిలోనే అప్పయ్య మంగళాంబ పునర్మాంగల్య ధారణకు ఒప్పుకోలేక పోయాడు

ఈ నాటిక కందుకూరి వీరేశలింగం గారి వితంతు వివాహోద్యమాన్ని చక్కగా ప్రతిబింబించింది శివశంకరులు కూడ మానవత్వంతో ప్రతిస్పందించారు. కాబట్టే మహాపండితుడైన అప్పయ్య దీక్షిత పాత్రద్వారా తన సుముఖతను వ్యక్తపరిచాడు. కాని తనకాలం నాటి నైష్ఠికులు కర్మిష్ఠులు ఏ విధంగా వెంటాడారో, సాహసాన్ని చూపలేక పోయారో ఈ నాటిక ద్వారా సువ్యక్తం చేశారు కవి శివశంకరులు

అప్పయ్య దీక్షితుల నిర్ణయం ప్రకారం వితంతువివాహం నిరాకరింపబడినా, అది ఆనాటి వైదిక శాస్త్రబద్ధతకు, సంఘ భీతికి నిదర్శనమే కాని అది అప్పయ్య గారి నిర్ణయం కాలేదు ప్రతి తండ్రి తన తనయుల మాంగల్యాన్ని కోరుకొనే హృదయ మార్దవం ఉన్నవారే అని అప్పయ్య దీక్షితుల మొదటి నిర్ణయం తెలుపుతుంది. ఈలాంటి పరిస్థితుల్లో సాహసం చూపకలసిందనీ, మానవత్వాన్ని వదలకర్దనీ, హృదయ దౌర్బల్యాన్ని వదలమనీ, కుమ కాలీన వైదిక నిష్ఠాగరిష్ఠులనబడే వాళ్ళకు హెచ్చరించారు. శివశంకరశాస్త్రిగారు

ఈ విధంగా పరిశీలిస్తే శివశంకరులు గేయ కావ్యాల్లోనే కాకుండా గేయ నాటికల్లోకూడా సామాజికస్పృహ ఎంతైనా కనిపిస్తుంది ఒక పరిధిలో కొన్ని నియమాలకు లోబడి ఆయన రచనలు చేశారు. ఆయనకు 14 భాషలు తెలుసు. ప్రాచీన సాహిత్యాలు, లక్షణ గ్రంథాలు బాగా చదువు కున్నారు. యామి పదాంకం, ఉద్యాక్షణం. వరపరీక్ష, దీక్షిత దుహిత, అనే గేయ నాటికలు ఒక్కొక్క సాంఘిక సమస్యను ప్రధానంగా తీసికొని రచింపబడ్డవే ఆనాడు 'ఎంకిపాటల' మీద దుమారం లేస్తే సభాపతిగాఉండి, తాను ఆ ఎంకిపాటల్ని సమర్థించారు అచ్చమైన తెలుగువాడి నోట వెలువడే వ్యావహారికంలో ఉండే సొబగు మనకు ఎంకి పాటల్లోనే కనిపిస్తుంది. ఇది శాస్త్రి గారి భాషాభిమానాన్ని తెల్పుతుంది.

ఈ విధంగా శివశంకరశాస్త్రి గారి కృతుల్లో అంతర్గతంగా సాంఘిక సమస్యల చర్చ, బహిర్గతంగా వ్యావహారిక భాషా ప్రయోగం మనకు కొట్టవచ్చినట్లు కనిపించే లక్షణం. 'కవి ఆత్మధర్మం తన సాహిత్య కృషిలో ప్రతిబింబిస్తుంది' అన్నట్లు శివశంకరశాస్త్రి వ్యక్తిత్వం ఆయన కవిత్వంలో ఎప్పటికీ ప్రతికే వుంటుంది.

## Bibliography -


1. శివశంకరశాస్త్రి కృతులు ప్రథమ, ద్వితీయసంపుటాలు,
2. నవ్యాంధ్ర సాహిత్య వీథులు 2 వ వాల్యూమ్. కురుగంటి సీతారామ భట్టాచార్యులు, పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు.
3. ఆంధ్ర రచయితలు. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.
4. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ఆచార్య దివాకర్ల వేంకటావధాని.
5. సాహిత్యంలో దృక్పథాలు ఆర్ యస్. సుదర్శనం


(ఈవ్యాసరచనకు ఉపకరించిన తమ లిఖితప్రతిని అందించిన డా॥ కె. వి సుందరాచార్యులు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యభాషా కళాశాల హైదరాబాదు-1 వారికి కృతజ్ఞతలు)

# వేదమువారి యౌగంధరాయణుడు

- శ్రీమతి కొలచలమ శారద.

(గతసంచిక తరువాయి)

ఆయన గాలిని పేనును, తోయముతో నరుకు, పొగలతో గోడలిడున్, అను శిరస్తాదారు విశ్వాసరావు పలుకుల వలన యుగంధరుని ప్రజ్ఞాపాటవములు వెల్లడి యగుచున్నవి

యౌగంధరాయణుడు ఊరలేని సమయము కనిపెట్టి తురకలు ప్రతాపుని అడవిలో అలసి నిద్రించువానిని ఒంటరి పాటున బంధించిరి 'ఆ మహామహుడు యుగంధర దేవుని పలుకులు పాటింపక వేట కరిగిన ఫల' మిది' యని ప్రతాపుడు వాకొనును.

యుగంధరుని దిట్టతనము, కార్యనిర్వహణ సామర్థ్యము, గాంభీర్యము సాటిలేనివి.అతనికి అలౌకిక శక్తులేవియు లేవు కేవల బుద్ధిబలముచేతనే అసాధ్యములు, అద్భుతములునగు కార్యములు సాధించెను రాజు పోలికలు గల చాకలిని అస్వస్థుడగు రాజునుగా ప్రకటించును ఇందువలన, రాజ్యమున అంతఃకల్లోలములు లేకవు. రాజను భ్రమతో చాకలిని తెచ్చితి మని తురకలు ప్రతాపుని విడుచుటకును అవకాశ మున్నది రాజమాతకు మాత్రము అత్యవసర పరిస్థితిలో 'కొనిపోగా నమ్మ నీపట్టిని వనరకు ఏడు నెలలు 10 దినములలో దెచ్చిఇత్తు దేవీ నీకుక్' అని తెలిపి తమ్మునితో 'వ్వేరిగాడు రాజుగా మీరు ప్రతాపరుద్ర నాటక మాడవలెను ఏడు మాసముల పది దినముల పిమ్మటనే మాదర్శనము. మేము ఎక్కడికో! ఏలకో!' అని తన వర్తనము ఈషణ్మాత్రము తమ్ముని కైన తెలియనీయక, వెడలిపోవును రాజ్యవ్యవహారముల రహస్యవర్తనము అత్యావశ్యకము రాజనీతిజ్ఞుడగు యుగంధరుడు బైటపడునా?

ఢిల్లీచేరిన యుగంధరుడు పిచ్చివాని వలె వేషము వేసి ఢిల్లీపురవీథులలో 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్' అని తానుచేయగల కార్యము బాహాటముగానే ప్రకటించెను ఇతని మాటలలో ప్రత్యక్షర గూఢత లేదు. అటనట మాత్రము కలదు యుగంధరుని ఉన్మత్తవేష వర్తనము అత్యుత్తమమైనది. ఈ నాటకమున యుగంధరుని మనము రెండువిధములుగా చూడగల్గుదుము 'మంత్రం కరోతీతి-మంత్రిః' అను పదమునకు అక్షరసార్థకత కల్పించుచు బందీ అగు రాజును గౌరవ పురస్సరముగా విడిపించుట, తానుస్వయముగా ఉన్మత్తవేషము ధరించి, అనేక-ఇడుమల కోర్చి, సుల్తానుదృష్టినాకర్షించి తమ ప్రభువును నిద్రితుని వారెట్లుబందీ చేసిరో అట్లనే తానును ప్రతిక్రియ యొనర్చుట-

రాజు అనారోగ్యముతో నున్నాడని ప్రకటించి జనార్దనాదులను రాజకార్యములు నెరవేర్ప నియమించును ఈ కల్పితకథ ఆధారముగా రాజును బందీచేసిన వలీఖాను ఖుస్రూ ఖాన్ లకు వారిలో వారికి భేదము పుట్టించి వలీచేత ఖుస్రూను వధింపచేయును వలీఖానుకు రాజ్యాశ కల్పించి సుల్తాను సపరివారముగా ఓడలోనికి వచ్చినపుడు వలీ అశనిని చంపునట్లు ఏర్పాటు చేసి, నగలకు వెలకట్టు నిమిత్తము రాజును గౌరవవేషమున సుల్తానుతో పడవలోనికి రప్పించి సుల్తాను వినోదార్థము నాటక ప్రదర్శనమని వలీ కుట్ర అంతయు అంతర్నాటక రూపముగా బహిరంగపరచును సుల్తాను వలీ కుట్ర గ్రహించి ఆగ్రహోదగ్రుడై వలీని శిరశ్ఛేదము చేయుట తాను బందీ అని తెలిసికొని ఇదంతయు యుగంధరుని చాకచక్యము వలన, ఆసాధారణ ప్రతిభ వలన జరిగినదని తెలిసికొని - నిశ్చేష్టుడగుట - ఈ సూత్రమంతయు, యుగంధర మంత్రాలోచనకు తార్కాణము ఇక ఉన్మత్తవేషధారణ - అప్పటికి ఆ మాటలు, చేష్టలు నాన్యతోదర్శనీయములు తన, కుమారుని శిష్యునిగాచేసికొని చెకుముకి మొదలగువారిని తగుకార్యముల నియమించి వారికపుడెట్లు మెలగవలెనో వర్తమానములు బహిరంగముగనే పంపుచు తన యెడల మానవ ప్రాణికి సందేహము కలుగనట్లుగా బహుజాగరూకతతో మెలగును

'తాటికాయ నీటికాడ నాటినారయా!
తాటిబొంద నీటిలోన మీటినారయా!

ఇది,పైకి అర్థరహిత మగు పాట వలీఖాను ఖుస్రూనిచంపించిన వైనమంతయు ఇందున్నది. ఈ విషయ మంతయు యుగంధరుని శిష్యులవలె నటించు అనుయాయుల వలన తెలిసికొని అందలి యథార్థవిషయమును గ్రహించి చేయవలసిన కర్తవ్యమును

'తాటికాయ గోతినుండి తవ్వివేయరా!
తాటిబొంద నీటినుండి దాటి యెత్తరా!'

అని అతడు చేయువలసినపని సాంకేతికముగనే నిర్దేశించును. ఈవిధముగా చూచు వారికెట్టి సంకోచమునకు సందీయక, అతి సహజమగు రీతిలో రాజును గొనిపోవుటకు అన్నిఏర్పాట్లు చేయును. ఇంతనిర్భయముగా శత్రువులమధ్య సంచరించుచు అన్నపానాదులు విస్మరించినను తన ధర్మమును మాత్రము ఇతడు విడువడు నీటిని చూచినంతనే 'నీళ్ళు దొరకినవి. నేను బాపనాట ఆడతా' అని బ్రాహ్మణులను వెక్కిరించు నట్లుగా

(తరువాయి 16 పేజీలో)

# పురాణములు - భక్తి

- శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం. ఏ.

భారతీయ ధార్మికత ఆస్తిక్య భావనపై ఆధారపడి యున్నది. 'ఆస్తిక్య భావనమే మానవ జీవితౌన్నత్యమునకు పునాది' అని మన ప్రగాఢమైన నమ్మిక. ఉపనిషత్తుల కాలమున జ్ఞాన ప్రాధాన్యము గ్రహింపబడినది కాని క్రమక్రమముగ మానవులలో ఇష్ట దేవతా ప్రీతి విగ్రహారాధనము హెచ్చుకాజొచ్చినవి. నామరూపాత్మకమైన దైవమే మానవులకు సంతృప్తినొసంగజాలినది. భగవంతుని లీలా విలాసములు, అవతారకథా విశేషములు, సృష్టిరహస్యములు మున్నగు వాని పట్ల మానవుని కుతూహల మినుమడింప సాగినది. ఇట్టి కోర్కెను సంతృప్తి పరచుటకై పురాణవాఙ్మయము రూపు దాల్చినది

మహర్షి వాల్మీకి ప్రణీతమైన శ్రీమద్రామాయణమే ఆదికావ్యము. వ్యాసప్రోక్తమై, ఇతిహాసముగ మహాభారత గాథ, అనంతరకాలమున అష్టాదశ పురాణములు, ఆవిర్భవించినవి. వాఙ్మయ చరిత్ర ననుసరించి పురాణములందు చిట్టచివరిది భాగవతము. ఎడనెడ ప్రాసంగికముగా భక్తి తత్పరత, తాత్త్విక చింతనము చూపట్టినను; రామాయణ, మహాభారతములందు ప్రధానాంశములు వేరుగ కన్పట్టును. శ్రీమద్రామాయణము ధర్మప్రబోధనమైన మహా కావ్యముగ అవతరించినది. మహాభారతము రాజనీతి ప్రధానమగు మహేతిహాసమై పుట్టినది. నిండారిన భక్తితత్పర భావముతో వెలసిన మహాపురాణము భాగవతము. ఇమ్మహాపురాణమునకు 'మోక్ష శాస్త్ర' మని నామాంతరము.

సగుణ భక్తి భావనము పురాణకాలము నుండియే అరంభమైనది. నామరూప భిన్నములైన పలువురు దేవతలు, వారి లీలలు అవతారగాథలు భక్తుల చరిత్రలు, భగవంతుని మహిమలు, పురాణములందు ప్రధానాంశములు. భక్తిభావ ప్రేరకములగు సన్నివేశములు పురాణములందు కోకొల్లలు.

ఉపనిషత్తుల యుగము నాటికే సాధకుని దృష్టి కర్మకాండలనుండి యొకింత మరలినది. బాహ్యప్రపంచము నుండి అంతర్జగత్తు దెస దృష్టి సారించినాడు మానవుడు. నామరూపాత్మకమైన ఈ ప్రపంచములో అంతర్లీనమై నిత్యము, శాశ్వతము నైన సత్పదార్థము గలదని, అట్టి సత్పదార్థమును జ్ఞానముచే పొందగలమని, అదియే 'మోక్ష' మని కదా! ఉపనిషత్ప్రవచనము. ఐనను, ఉపనిషత్తులందు నిర్గుణ, నిర్విశేష, నిరాకారుడగు అవాఙ్మానసగోచరుని గూర్చిన ఆత్మబోధకే ప్రాధాన్యము గాని, సగుణభక్తికి కాదు. వేదము లందును, ఉపనిషత్తు లందును నిర్గుణోపాసనము ప్రధాన భూమిక వహించినది. ఐనను భగవానుని సర్వాంతర్యామిత్వము, సర్వశక్తిమత్ స్వభావము, భక్తవత్సలత్వము, తేజోమయానందతత్త్వము రసస్వరూపత్వము లను ఉపనిషత్తులు పేర్కొన్నవి. ఏవంవిధమైన ఉపనిషత్తత్త్వమే పురాణములందు కథారూపమున అవతరించినది

భక్తి సాధనకు సంబంధించిన బీజము వేదములందు నిహితమై ఉపనిషత్తులయందంకురించి, పురాణ కాలము నాటికి శాఖోపశాఖలతో, ఫలపుష్ప సమృద్ధమైన మహావృక్షమై పరిణమించినది.

పురాణములందు కర్మజ్ఞానముల కంటె సహజము, సులభము నైన భక్తికి ప్రాధాన్యమీయబడినది.

సగుణభక్తి - వేదవేద్యుడగు పరబ్రహ్మ ముత్తమాధికారులకే అందుబాటులో నుండగా, పురాణ పురుషుడగు సర్వాంతర్యామి యెల్లరకును సన్నిహితుడై యున్నాడు.

ప్రత్యక్షముగా ఆరాధించుట కనువుగా, సగుణ స్వరూపుడైన భగవంతుని గూర్చి పురాణములు ఎక్కువగా ప్రస్తావించినవి.

సగుణ భక్తిని గూర్చిన చర్చ పద్మపురాణోత్తర ఖండమున 'శివగీత' లలో కలదు. అవాఙ్మానసగోచరుడగు సర్వాంతర్యామి సాధకున కెట్లు ప్రాప్తించునని శ్రీరాముడు ప్రశ్నించెను శంకరుడాతని సందేహనివృత్తి గావించెను. సగుణోపాసనమును తగణోపాయముగా జూపెను. సగుణోపాసనము చిత్తైకాగ్రతను సాధించుకొను మార్గ మని, క్రమముగా స్థూల సౌరాంభికా న్యాయము ననుసరించి నిర్గుణ బ్రహ్మయందు మనసు లగ్నము కాగల దని ఈశ్వరుడు వివరించెను.

'శ్రుణు, రాజన్! ప్రవక్ష్యామి
 తత్రోపాయం మహాభుజ।
సగుణోపాసనాభిస్తు
 చిత్తైకాగ్ర్యం విధాయ చ।
స్థూల సౌరాంభికా న్యాయాత్
 తత్ర చిత్తం ప్రవర్తయేత్॥'

స్థూలమును గూర్చి తెలిసికొనుట, పిమ్మట దాని ద్వారా సూక్ష్మమును గుర్తెరుంగుట అను పద్ధతికి 'స్థూలసౌరాంభికా న్యాయ' మని పేరు

భగవంతుడు భక్తవత్సలుడు సాధకుల ఆరాధనకు అనుకూలముగా నుండదలచి, నిరాకారుడయ్యును సాకారముగ నావిర్భవించి ధర్మార్థకామ మోక్ష ఫలప్రదుడగుచున్నాడు

'సాధూనా మప్రమత్తానాం
 భక్తానాం భక్తవత్సలః।
ఉపకర్తా నిరాకార
 స్సదాకారేణ జాయతే।
కార్యార్థం సాధకానాం చ
 చతుర్వర్గ ఫల ప్రదః॥'

అని అగ్ని పురాణము నుడువు చున్నది.

సగుణనిర్గుణోపాసనముల క్రమము దీని వలన తెలియుచున్నది. సగుణరూపములో నున్న దేవు నారాధించి, ఆతని నిర్గుణ తత్త్వమును తెలిసికొన వలయును. అప్పుడుసాధనము సగుణభక్తి.

భక్తిమహిమ – కర్మ, జ్ఞాన, భక్తి యోగములందు పురాణములు ఎక్కువగా భక్తియోగ విశిష్టత నుగ్గడించినవి. సత్వర ఫలమునిచ్చు సులభమైన సాధనము భక్తియోగము. స్త్రీ, పురుష, బ్రాహ్మణ, శూద్రాది ఉపాధి భేదము భక్తియోగమునకు అంతరాయము కాజాలదు. సర్వాంతర్యామిని ప్రేమించగల వారందఱును భక్తియోగమునకు ఉత్తమాధికారులే.

శరీర చిత్తములకు శ్రమ కల్గింపకయే, కేవలము మనః ప్రవృత్తిచే సాధింపదగినది భక్తియోగము. అది మిక్కిలి సులభమైనదను విషయమునే దేవీ భాగవతము ప్రస్తావించుచున్నది.

'మార్గాస్త్రయో మే విఖ్యాతా
మోక్షప్రాప్తౌ నగాధిప ।
కర్మయోగో జ్ఞానయోగో
భక్తియోగశ్చ సత్తమ॥
త్రయాణామప్యయం యోగ్యః
కర్తుం శక్యోఽస్తి సర్వథా।
సులభత్వాన్మానసత్వాత్
కాయచిత్తాద్యపీడనాత్ ॥'

అన్నివిధానముల కంటె భక్తియోగ మెంత ప్రశస్తమైనదో భాగవతములో చెప్పబడినది ఉద్ధవునకు పరమార్థతత్త్వము నుపదేశించుచు శ్రీకృష్ణుడు

'యత్ కర్మభి ర్యత్తపసా
జ్ఞానవైరాగ్యతశ్చ యత్।
యోగేన దానధర్మేణ
శ్రేయోభి రితరైరపి।
సర్వం మద్భక్తియోగేన
మద్భక్తో లభతేఽఞ్జసా,'

అని పల్కెను. కర్మ, తపస్సు, జ్ఞానము వైరాగ్యము, యోగాభ్యాసము, దాన ధర్మములు, తీర్థయాత్రావ్రతాదులు సత్ఫలితముల నిచ్చును. కేవలము భక్తియోగము వలననే భక్తుడు వాని నన్నింటిని పొందగలడు.

భక్తిమార్గానుగామియై సద్వర్తనవర్తుడైన సాధకుడే ఉత్తముడు. అతడే బ్రాహ్మణుడు భక్తివిహీనుడే నిజముగ చండాలుడు వర్ణవ్యవస్థ గుణకర్మలనుబట్టి కదా! యేర్పడినది! బ్రాహ్మణ చండాలురనిర్ణయము పుట్టుకను బట్టి కాక, భగవద్భక్తిని బట్టి నిర్ణయింపవలె నని పురాణములు పునః పునః ప్రస్తావించినవి.

'చండాలోఽపి మునిశ్రేష్ఠ
విష్ణుభక్తో ద్విజాధికః।
విష్ణుభక్తివిహీనశ్చ
ద్విజోఽపి శ్వపచాధికః॥'

అని బృహన్నారదీయ పురాణము చాటినది. భక్తునికి విశేషమైన ప్రాధాన్యముగలదని భాగవతము కూడ పేర్కొనుచున్నది.

'అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యం॥
తేపుస్తపస్తే జుహువుస్సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతియే తే'

ఎవని జిహ్వాగ్రమున భగవన్నామము కలదో అతడు చండాలుడయ్యు శ్రేష్ఠుడే, నామస్మరణము గావించునాతడే నిజముగ తపోధనుడు. అగ్నిహోత్రి అతడే సదాచారపరాయణుడు, పుణ్యతీర్థస్నాతుడు వేదాధ్యయనము గావించిన బ్రహ్మవేత్త యాతడే. అని భాగవతము నిర్ధారించినది

భక్తియోగ మెంతటి మహనీయమైనదో పురాణములు చక్కగా వివరించినవి. వేదోపనిషత్ప్రతిపాద్యాంశములను పురాణములు సైత మొకచో పేర్కొనును. ఐనను, పురాణముల ప్రాశస్త్యము ప్రశంసనీయము. పురాణపఠనము, అధ్యయనము మానవాళికత్యంతావశ్యకములు.

పురాణముల నధ్యయనము గావించినగాని విద్యాభ్యాసము పూర్తికాదు. వేదవేదాంగములను, ఉపనిషత్తులను తెలిసికొన్నను, పురాణశాస్త్రముల నభ్యసింపనిదే మానవుడు ధర్మవిదుడు కాజాలడు. వేదాధ్యయనముచే కలిగెడు జ్ఞానము ఇతిహాసపురాణముల పఠనము వలన మాత్రమేసంపూర్ణము, సమగ్రము, కాగలదని వాయుపురాణము చెప్పుచున్నది.

'యో విద్యాచ్చతురో వేదాన్
సాంగోపనిషదో ద్విజః।
న చేత్ పురాణం సంవిద్యా
న్నైవ స స్యాత్ విచక్షణః॥
ఇతిహాసపురాణార్థం
వేదం సముపబృంహయేత్।
బిభేత్యల్పశ్రుతాత్ వేదో
మామయం ప్రహరిష్యతి॥'

పురాణశాస్త్ర జ్ఞాన సహితముగాని కేవల వేదాధ్యయనము వలన వేదములు భయావహము లను నభిప్రాయ మేర్పడగలదు. దురవగాహములగు వేదోపనిషత్తత్త్వ మెఱింగి, జీవితమునందు సమన్వయించుకొనుట సామాన్యులకు సాధ్యము గాదు.

వేదములందలి నిగూఢమైన తత్త్వరాశియే విస్తృతమై, పెక్కు ఆఖ్యానములతో ఉపాఖ్యానములతో స్త్రీశూద్రాది సామాన్యులకు సైతము అందుబాటులో నుండునట్లు పురాణములం దవతరించినది. లోకకళ్యాణ మెంచి వ్యాసమహర్షి పురాణములను రూపొందింప సమకట్టెను

'వేదేభ్య ఉద్ధృత్య సమస్త ధర్మాన్
యోఽయం పురాణేషు జగాద దేవః।
వ్యాసస్వరూపేణ జగద్ధితాయ
వందే త మేవం కమలాసమేతమ్॥'

వేదసారమును పురాణరూపమున మానవుల కందించిన వ్యాసమహర్షి హృదయములోని జగత్కళ్యాణ కాంక్షను పద్మపురాణము వెల్లడించుచున్నది.

'ప్రతీకోపాసనము-క్రియాయోగము వైదికయుగమున యజ్ఞయాగాది క్రతువులు, నిర్గుణపరబ్రహ్మోపాసనము ప్రాధ

స్యము వహింపగా, పురాణయుగమున నొక క్రొత్త ఉపాసనపద్ధతి ప్రచారములోనికి వచ్చినది. మట్టిబొమ్మలలో దైవమును భావించుకొని, నామరూపాత్మక మగు భగవంతునికి అర్చనాదికములు సాగించుట వల్ల మానవుని ఆసక్తి హెచ్చు కాజొచ్చినది. విగ్రహారాధనలో భాగములంగా అర్ఘ్యపాద్యాదు లారంభమైనవి. షోడశోపచార విధివిధానము ప్రచారమునందుకొన్నది పూజావిధానము విశేషముగ వ్యాపించినది.

'య ఆశు హృదయగ్రంథిం
నిర్జిహీర్షుః పరాత్మనః।
విధినోప చరే ద్దేవం
తంత్రోక్తేన చ కేశవం॥
లబ్ధానుగ్రహ ఆచార్యాత్
తేన సందర్శితాగమః।
మహాపురుష మభ్యర్చే
న్మూర్త్యాభిమతయా ఽఽత్మనః॥'

జీవాత్మయొక్క హృదయ గ్రంథి విచ్ఛేదమైనంతనే సాధకుడు పాపనిర్ముక్తుడగు నని, మోక్షార్హుడగు నని మన వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. జీవాత్మయొక్క హృదయగ్రంథి విచ్ఛేదము నభిలషించు సాధకుడు వైదిక తాంత్రికవిధి ననుసరించి ఇష్టదేవత నారాధించును. గురువునుండి దీక్షనుపొంది, అర్చనపద్ధతుల నెఱింగి, తన కిష్టమైన మూర్తిద్వారా పరమ పురుషుని పూజగావించు నని భాగవతము ప్రవచించుచున్నది.

అభీష్ట దేవతారాధనకు సంబంధించిన 'క్రియాయోగము' భక్తిమార్గసాధనము లందొకటి. పురాణములు క్రియాయోగమునుగూర్చి వివరించినవి. క్రియా ము ననుసరించు భక్తుడు ప్రతిమారూపమున నున్న భగవంతునికి సేవచేయును అతనిని స్పృశించి, పారవశ్యము ననుభవించును, భగవానునికై పెక్కు భోగములం చేయును. ప్రసాద స్వీకారము గావించును. తనకొఱకై అను, సుఖదుఃఖము లన్నింటిని ప్రతిమద్వారా సర్వాంతర్యామికి నివేదించును. ఆలయనిర్మాణము, విగ్రహప్రతిష్ఠ, అర్చనాదికములు క్రియాయోగములో భాగములే. ఇట్టి క్రియాయోగము సాధకునిలో భక్తిభావమును ప్రేరేపించి, అతనిని మోక్షాభిముఖముగ నడుపును. క్రియాయోగమువలన సాధకుడు సులభముగా కృతార్థుడగు నని భాగవతము వివరించుచున్నది.

'ప్రతిష్ఠయా సార్వభౌమం
సద్మనా భువనత్రయం।
పూజాదినా బ్రహ్మలోకం
త్రిభి ర్మత్సామ్యతా మియాత్॥
మామేవ నైరపేక్ష్యేణ
భక్తియోగేన విందతి।
భక్తియోగం సలభతే
ఏవం యః పూజయేత మాం॥'

విగ్రహప్రతిష్ఠద్వారా సార్వభౌమత్వము, ఆలయనిర్మాణమువలన త్రిభువనాధిపత్యము. పూజాదికములచే బ్రహ్మలోకము లభించును. మూడింటి ననుష్ఠించిన భక్తుడు భగవంతునితో సమానుడగును నిష్కామభక్తియోగము లభించును.

**అవతారములు - అవతారవాదము**

పురాణములందు ప్రధానాంశము, అవతారవాదము సాధారణముగా గొని భక్తిధర్మము భక్తిసాధన విశేషమైన పుష్టినందుకొన్నవి. భగవంతుడు మానవాళి మధ్యమున కుమారుడుగా, సోదరుడుగా స్నేహితుడుగా, గురువుగా, ప్రభువుగా అవతరించినాడు. భగవంతుడు తనకు సన్నిహితు డన్న భావము మానవహృదయములందు స్థిరముగ నిలచియుండుటకే అవతారవాదము తోడ్పడినది. అవతారగాథలు పెక్కుపురాణములందు కన్పట్టును.

అవతార వాదమునకు కావలసిన సూచన వైదికగ్రంథములందే కానగును పురాణములందు వామనావతార వృత్తాంతము గలదు. ఈ వామనావతారము ఋగ్వేదమున నే సూచన ప్రాయముగ చెప్పబడిన దనవచ్చును. 2

విష్ణువు మూడడుగులలో త్రిలోకముల నాక్రమింపగలడనుటలో వామనావతారము సూచింపబడుచున్నది వామనావతార ప్రసంగముతోపాటు మత్స్యావతార ప్రసక్తియు శతపథ బ్రాహ్మణము నందు కానవచ్చును 3

కూర్మావతార ప్రసక్తి శతపథ బ్రాహ్మణమునందేగాక, తైత్తిరీయారణ్యకమునందును కన్పట్టును. 4 శతపథ బ్రాహ్మణముతో పాటు తైత్తిరీయ బ్రాహ్మణము నందును, తైత్తిరీయ సంహిత యందును కూడ వరాహావతార ప్రసక్తి గలదు. 4

భగవంతుడు భక్తులయందు తనకు గల అనుగ్రహమును ప్రకటించుటకై, మానవ రూపములో అవతరించి, తనలీలలను చూపి, వారికి సన్నిహితుడై మెలగును. జీవునిలోని భక్తి భావము ప్రకృష్టమగుట కీ లీలా రసాస్వాదనము సహకరించును.

'అనుగ్రహాయ భక్తానాం
మానుషం దేహ మాస్థితః।
భజతే తాదృశీః క్రీడాం
యాం శ్రుత్వా తత్పరో భవేత్ ॥'

అని భాగవతము పేర్కొనుచున్నది ఈ కారణముచేతనే రామకృష్ణాద్యవతార స్వరూపముల పట్ల మానవులం దధికమైన ఆరాధన భావము కన్పట్టును దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు భగవానుడు 'దిగివచ్చు' నని భక్తులకు నమ్మిక యేర్పడుటకు అవతారములు దోహదమొనర్చును మానవ రూపమందేగాక, మత్స్య, కూర్మ, వరాహాది రూపములలో భగవానుడవతరించుట వలన సర్వేశ్వరుడు సర్వప్రాణిహృదయాంతరవర్తి, సర్వసత్త్వస్వరూపుడు అను భావము భక్తులహృదయము లందు నెలకొన్నది

మానవునకు దైవముపట్ల నమ్మకమును, సర్వభూతదయను, సమదృష్టిని అందింప

ల అవతారవాదము పురాణముల విలక్షణత, విశిష్టత.

భగవత్తత్త్వము ఏకేశ్వరోపాసన సిద్ధాంతము - భగవంతుడు ఒక్కడే. కాని విభిన్నములగు విచిత్రలీలల నాతడు ప్రదర్శించుచును భక్తులఅభిరుచిని,అధికారి భేదమును, బట్టి, స్వభావభేదమును బట్టి, భిన్నవిభిన్నములైన రూపములందు కన్పించుచును భక్త డభిలషించునామ రూపముల ద్వారా సాధకుడు సర్వేశ్వరుని చేరగలడు.

అద్వితీయమైన ఒకే ఒక్క బ్రహ్మతత్త్వము గుణభేద, క్రియాభేదములను బట్టి అనంతములగు నామరూపములతో ప్రకాశించుచున్నది ఒకే స్ఫటికమణి భిన్న భిన్న వర్ణములలో ప్రకాశించునట్లు జగన్మాతయు సత్త్వాదిగుణ తారతమ్యమును బట్టి పెక్కుభావములలో రూపములలో వర్ణింప బడుచున్నది. ఒకేమేఘము వర్ణమును బట్టి ఆకృతిని బట్టి వేర్వేరు రూపములలో కన్పించుచున్నట్లు ఒకే దేవీ తత్త్వము గుణవశమున వేరు వేరు రూపములుగా భాసించుచున్నది దేవీ పురాణ మీవిషయమునే పేర్కొను చున్నది.

'యథా తు వ్యజ్యతే వర్ణై
ర్విచిత్రైః స్ఫటికో మణిః।
తథా గుణ వశాద్దేవీ
నానా భావేషు వర్ణ్యతే ॥
ఏకో భూత్వా తథా మేఘః
పృథక్త్వే నావతిష్ఠతే ।
వర్ణతో రూపత శ్చైవ
తథా గుణవశా జ్జయ ॥'

విభిన్న పురాణములు బ్రహ్మ, విష్ణు, శివ మహిమలను వర్ణించినవి. కాని త్రిమూర్తులు విభిన్నులు కాజాలరనియు, ఒకే పరతత్త్వముయొక్క త్రివిధప్రకాశ రూపములనియు, అపరతత్త్వము అభిన్నమనియు పురాణములు పునఃపునః ఉద్ఘోషించుచున్నవి.

'రజస్సత్త్వంతమ శ్చేతి
పురుషం త్రిగుణాత్మకం ।
వదన్తి కేచి బ్రహ్మాణం
విష్ణుం కేచిచ్చ శంకరం ॥
ఏకో విష్ణుస్త్రిధా భూత్వా
సృజత్యత్తి చ పాతి చ॥
తస్మాద్భేదోన కర్తవ్య
స్త్రిషు దేవేషు సత్తమైః ।'

రజస్సత్త్వతమో గుణములకు ఆకృతి నొసగి బ్రహ్మ, విష్ణు, శివనామములతో వ్యవహరించు చున్నాము ఒకే పరమ పురుషుడు త్రివిధ రూపములలో సృష్టి స్థితి లయములను నిర్వహించు చున్నాడు. అందుచేతనే జ్ఞానవంతు డీ మువ్వురి విషయమునందును భేద దృష్టిని పాటింపడని పద్మపురాణ క్రియాఖండము పేర్కొను చున్నది

విష్ణుపురాణము ననుసరించి భగవంతుడు జనార్దను డొక్కడే. సృష్టి, స్థితి, లయ రూపమైన క్రియా భేదముచే బ్రహ్మ విష్ణు శివసంజ్ఞలను పొందుచున్నాడు

'సృష్టి, స్థిత్యన్త కరణాత్
బ్రహ్మ విష్ణు శివాత్మికామ్ ।
స సంజ్ఞాం యాతి భగవా
నేక ఏవ జనార్దనః॥'

భగవంతు డొక్కడే' అని గుర్తుంగుటయే ఆధ్యాత్మికజ్ఞానము విభిన్న మతానుయాయుల మధ్య అవగాహనతో కూడిన సామ రస్య సాధన దీని వలన కలుగు ఫలితము. సమస్యయ దృక్పథమే కదా!

(సశేషము)

1. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః। - భగవద్గీత అధ్యా. 4 శ్లో. 13

వర్ణవ్యవస్థ గుణకర్మలనుబట్టి కదా యేర్పడినది? బ్రాహ్మణ చండాలుర నిర్ణయము పుట్టుకను బట్టికాక ఇచట వ్యాసకర్త మిక్కిలి పొరపడిరి ఇచట వీరుదాహరించిన 2, 3 శ్లోకమును వీరి నిర్ణయమును సమర్థింపక పోవుటేకాక ఖండించును కూడ (సం పా.)

2 'ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।' 1-12 17, 18 ఋగ్వేదము.

3 వామన శతపథ బ్రాహ్మణము 1-2-5-1-6.
మత్స్య శతపథ బ్రాహ్మణము 1-8-1-2-10

4 శతపథ బ్రాహ్మణము 8-4-3-5.
తైత్తరీయారణ్యకము 1-2-3-1.

( 14 వ పేజీ తరువాయి )

సంధ్యావందనాదికముల నిర్వర్తించును పడవలో సుల్తాను ప్రక్క సుఖాసీనుడై కూరుచుండి, ఆనందముగా రాజుకు, త సహచరులకు మాత్రము అర్థమగురీతిలో 'అల్లవాడిల్లహో, ఇల్లవాడల్లహో' -అని పరిహాసముగా పలుకును. అల్లవాడనగ అచటి ఓరుగంటి ప్రతాపు డిచట - ఇల్ల వాడగు సుల్తాను ఓరుగంటి కేగుచున్నాడని గూఢార్థము.

'రాజునేమో పట్టలేదు రాతు నేమో పట్టలేదు చాకలిపేరని వలీసాయె బయట పట్టినా 'డని' వలీచేసిన మోసము తెలి సుల్తానును విభ్రాంతునిగా చేయును ప్రతాపరుద్రుని గొనిపోయి ముమ్మడవ కప్పగించి 'నాపలికిన మాటను జగదీశ్వరుడు నెరవేర్చెనా' డని పలుకును అ తటి రాజకీయ యుగంధరునకే వినయము దైవభక్తి భూషణములైనవి ఈవిధముగా అత్యంతశక్తి యుక్తులతో సామదా భేదోపాయములు మాత్రము ప్రయోగించి రాజును గొనివచ్చి తన ప్రభువునిం చేసిన సుల్తానుతో రాజునకు సఖ్యమేర్ప చెనే కాని విరోధింపలేదు సుల్తా ప్రభువుల చేయికలిపి, 'మయశంబరు వలె మీరిరువురు సఖులై యుండవలె' న ఆకాంక్షించును. ఇది యుగంధర ప్రతిభా విశేషము

# ఈ పక్షంలో

**తమీ నవ్యసాహితి - చర్ల**
**గాది :- వేడుకలు :-**

దుర్మతి సంవత్సరాది రోజున గౌత నవ్య సాహితి సత్యనారాయణపురం (ఖమ్మంజిల్లా) వివిధ సాహిత్యకార్య క్రమాలను నిర్వహించింది. ఉదయం మ్మిది గంటలకు సరస్వతీ పూజతో ర్యక్రమాలు ప్రారంభింపబడినవి. పది ంటలకు పంచాంగ శ్రావణం జరిగింది. ధ్యాహ్నం 3 గం॥లకు బ్రహ్మశ్రీ పూరి వేంకటేశ్వరరావు (కొవ్వూరు) రిచేత అష్టావధాన కార్యక్రమము నిర్వ ంపబడింది. పృచ్ఛకులుగా శ్రీ చింతల ాడి వేంకటేశ్వర్లుగారు సమస్యను, శ్రీ డిచేటి శాయన్నాచార్యులుగారు దత్త దిని, శ్రీ నిమ్మగడ్డ పాలశంకరంగారు షేధాక్షరిని, శ్రీ కాకర్లపూడి సుబ్బ రాజు గారు వర్ణనను, శ్రీ వల్లేమూడి సౌం దరగాజన్ గారు వ్యస్తాక్షరిని, శ్రీ కూచి ట్ల పార్థసారథిగారు పురాణమును, శ్రీ ట్ల వెంకట నరసింహరాజు గారు పుష్ప ాన్ని శ్రీ చింతలచెర్వు వెంకట ృష్ణారావుగారు అప్రస్తుత ప్రసంగాన్ని వహించారు. అవధానం మూడున్నర టలపాటు జరిగింది. శ్రోత లందరూ ంత్రముగ్ధులై కూర్చుండి అప్పుడే అయిపో ందా అని అంటూ లేచారు చివరికి, వధానానంతరం శ్రీ దాట్ల వెంకట తారామ రాజుగారు అవధానిగారిని తన వస్త్రాలతో సన్మానించారు. అవ ని గారు కృతజ్ఞతల అనంతరం సంస్థ షిక సంచిక 'మానస' ను ఆవిష్కరి చారు. ఈ సందర్భంగా జరిగిన బాల యితల స్వీయకవితాపఠన-పోటీలలో మారిభూపతిరాజు రాజశ్రీకి ప్రథమబహు తి, చిరంజీవి తాతోట దుర్గాచారికి తీయబహుమతి లభించాయి. శ్రీ పతి రాజు బుచ్చివేంకట పతిరాజు రు బహుమతి ప్రదానం చేశారు. అనంతరం 'చాణక్య' ఏకపాత్రాభినయం ప్రదర్శింపబడింది. నటుడు శ్రీ కల్లూరి రామమోహన రావుగారిని సంస్థతరఫున శ్రీ పెన్మెత్స శ్రీ రామమూర్తిరాజు గారు, స్థానిక సీతారామకళాసమితి తరఫున శ్రీ దాట్ల వీరభద్రరాజుగారు సన్మానించారు. కార్యదర్శి శ్రీ పెద్దాడ వెంకటరాజ గోపాలస్వామిగారు వందన సమర్పణ చేశారు. (చిం. వెం. సహాయకార్యదర్శి.)

## మహాపండిత సత్కారము

రాజమండ్రి హిందూసమాజము గీతా వర్గము యాజమాన్యమున 5-4-1891 తేదీ ఆదివారం సాయంకాలం 6 గం॥ లకు హిందూసమాజమున మహాసభ అందు పండితపూజ జరిగినవి. సభకు వేదార్థ సమ్రాట్టు శ్రీ రేమెళ్ల సూర్యప్రకాశ శాస్త్రిగారు అధ్యక్షత వహిస్తూ సర్వ హైందవధర్మములకు మూలము వేదములే యని వివరించి సన్మానము నొందు చున్న శ్రీ విశ్వనాథ జగన్నాథ ఘనాపాఠిగారి వాచస్పతి బిరుదము సార్థకమైన దని వక్కాణించిరి.

సమాలోచన సంపాదకులు విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు సభా ప్రారంభము చేయుచు సమస్త దేవతలు వేదవేత్తలందు నివసింతురు. వేదవేత్తను సమస్కరించిన నాదేవతలందఱు సంతసింతురు. వేదమునకు స్వరము ప్రధానము. ఉచ్చారణ సౌష్ఠవమువలన ఇష్టప్రాప్తి, స్వరదోషమువలన అనిష్టప్రాప్తి కలుగును. స్వరదోషరహితముగా సలక్షణముగా వేదము పఠింపగలిగినవారు వేదవిదులు' అని శ్రుతిప్రమాణ-ఉదాహరణములతో వివరించి సుస్వరమధుర ఘనపఠనమున శ్రీ జగన్నాథ ఘనాపాఠీ గారికి ఆంధ్ర దేశము నేకాక యావద్భారత దేశమున సాటిలేరని ఒక రాజ్యమిచ్చినా ఆయన ప్రతిభా విశేషమునకు తక్కువయే అగునని తెలిపిరి.

సమాజ అధ్యక్షులు శ్రీ న్యాపతి రఘునరావుగారు శ్రీ-జగన్నాథ ఘనాపాఠీగారిని నూతన వస్త్రములతోను నూట పదార్లతోను సత్కరించిరి. ఆస్తికులు కొందఱు కూడ ఘనాపాఠీ గారిని సన్మానించిరి.

ఘనాపాఠీ గారు సన్మానమునకు సమాధానమిస్తూ ఇతరత్రా ఎన్నిఘనసన్మానములందినను స్వస్థానమున జరగిన ఈ సన్మానము తమకు మిక్కిలి ఆనందదాయక మనిరి. జ్యోతిర్విజ్ఞానచంద్రిక సంపాదకులు శ్రీ మధునకృష్ణమూర్తిశాస్త్రి గారు ఘనాపాఠీగారి విశిష్టతను దెలిపి సుమధురముగా పంచాంగ శ్రావణము గావించిరి. వేదపఠనముతో ఆరంభమైనసభ శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి వందనసమర్పణముతోను, స్వస్తివచనములతోను సమాప్తమైనది. *

---

## ఆహ్వానము

## వసంతోత్సవము

ది 19-4-81 తేదీ ఆదివారం సాయంకాలం గం. 6 లకు రాజమండ్రి హుషారు క్లబ్బువారి యాజమాన్యమున శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో (కృష్ణా టాకీసువద్ద) సాహిత్యసభ జరగును. శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు అధ్యక్షత వహింతురు.

శ్రీ పి. శ్రీరామమూర్తిగారు ముఖ్య అతిథి ప్రసంగము చేయుదురు.

శ్రీ బుద్గా పాపయ్యశాస్త్రిగారు సభా ప్రారంభము చేయుదురు.

మహాభారత పరిశోధకులు 1. శ్రీ జె. మృత్యుంజయరావుగారు, 2. శ్రీ యన్. గోపాలకృష్ణమూర్తిగారు, 3. శ్రీ సి హెచ్. చిన్మయబ్రహ్మ కవి గారు క్లబ్బు వారిచే సన్మానింపఁ బడుదురు. తమ పరిశోధనను గుఱించి ప్రసంగములు చేయుదురు. సాహిత్యాభిమానులెల్లరు విచ్చేయ ప్రార్థితులు.

డా. యం. రామకృష్ణారావు,
ప్రధాన కార్యదర్శి,
హుషారుక్లబ్బు, రాజమండ్రి.

Regd No H/Rmy-42.

**Samalochana 16, Aprial 1981**

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో గూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డ పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు

అడ్రసు :—

**సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,**

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.**